# శ్రీ శ్రీ

# సినిమా పాటలు

## ఉక్కుపిడికిలి, అగ్నిజ్వాల

సంకలనం: సరోజా శ్రీ శ్రీ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**UKKUPIDIKILI, AGNIJWALA - SriSri Cine Songs**

Compiled by: Saroja SriSri

ప్రచురణ నెం. : 2238

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2001



వెల: రూ.40-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్, సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-500 029

# ఇదీ వరస...

## ఉక్కు పిడికిలి

# అగ్నిజ్వాల

★ ★ ★

# నదురు బెదురు ఎదురులేని

పల్లవి: నదురు బెదురు ఎదురులేని – ఉక్కుపిడికిలీ
కోపగించి కోరుతుంది దుష్టనరబలీ
మట్టిచెయ్యి మారుతుంది ఉక్కుకత్తిగా
మట్టుబెట్టి తీరుతుంది సంఘశత్రులా ॥నదు॥

అనుపల్లవి: పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే॥

చరణం 1: ఆగండీ ఆగండీ దేవుడుగారూ
దేవుడుగారూ మహానుభావుడుగారూ
యుగే యుగే సంభవామి
సరేసరే దానికేమి॥ ॥నదు॥

చరణం 2: ఈలోగా మాగోల – వినేవాడు కానరాడు
దేవుడుగారూ – మహానుభావుడుగారూ
మావిన్నపమున్న దొకటి – మన్నిస్తారూ
ఓ దేవుడుగారూ................

చరణం 3: చేపలాగ పందిలాగ
శ్రీరాముడిలాగ మీరు
అవతారాలెత్తి యెత్తి
అలసి సొలసి పోయినారు
అపరాధుల శిక్షించే – ఆయుధాలు మాకొసంగి
ఆపై కథ మాకు వదలి – హాయిగ నిదురించండీ
లేనిపోని బెడదలింక – చాలును విరమించండీ ॥నదురు॥

---

చరితచిత్రవారి "ఉక్కుపిడికిలి"లోనిదీ పాట. ఈ పాట 30-1-1982లో రాసేరు.

☆ ☆ ☆

# పసిడి మెరుగుల బాలల్లారా!

పల్లవి: పసిడి మెరుగులా బాలల్లారా
పాలబుగ్గలా కూనల్లారా
ఎవరో చెప్పండీ - మీరు
ఎవరో చెప్పండీ - ......॥

అనుపల్లవి: నేటి బాలలం - భావిపౌరులం
తెలుగు సంపదకు వారసులం
దేశానికి పరిపాలకులం మన
దేశానికి పరిపాలకులం॥

చరణం 1: ముద్దుముద్దుగా దేశం అంటూ
పెద్దమాటలే అంటున్నారే
దేశం అంటే - ఏమో తెలుసా
చెప్పండి - మీకు తెలుసా చెప్పండి॥

చరణం 2: మట్టీ మన్నూ దేశం కాదు
చెట్టూ చేమా దేశంకాదు
మనమే దేశం - దేశమే మనం
దేశం అంటే మనుష్యులే ఏ
దేశం అయినా మనుష్యులే॥

పసిడి మెరుగులా బాలల్లారా
పాలబుగ్గలా కూనల్లారా
మీరన్నది నిజమే - ఇక
వస్తుందాదినమే॥

చరణం 3: మనమే దేశం అయితే - ఈ
మనిషే దేశం అయితే -
కొందరికెందుకు సౌఖ్యం - మరి
కొందరి కెందుకు కష్టం...

కొందరు మాత్రం దేశ సంపదను
కొల్లగొట్టుతూ కులుకుతువుంటే
కూడూ గుడ్డా కరువైపోయీ
మాడే ప్రజలే మిగిలేరు
అల్లాడే ప్రజలే మిగిలేరు॥

చరణం 4: మీరే పాలకులైతే
అధికారం మీదే అయితే
ఏవి పనులను చేస్తారు మీ
రేయే మార్పులు తెస్తారు॥

మన నెత్తురు పీల్చి బలిసి
మన నెత్తులు కొట్టి బతికి
ఊరేగే కామందులు
చెలరేగే రాబందులు

మాకోపపు మంటల్లో
మాడే దినముంది ముందుముందు
కబడ్దార్ - కబడ్దార్
కార్మికుల్లారా హుషార్॥.....

---

ఈ పాట ఫేర్ చేస్తుంటే ఓ సంఘటన జ్ఞాపకంవస్తోంది. ఒకసారి "రూర్కెలా"లో శ్రీశ్రీగారికి సన్మానం అంటే ఇద్దరం మద్రాసులో బంకోరా ఎక్స్‌ప్రెస్ ఎక్కి మూడవనాటి సాయంత్రానికి చేరుకున్నాం. సన్మానం అయిపోయాక మీటింగ్ కార్యక్రమం అయేక ఇంటికి చేరుకున్నాం. రాత్రి పదిమంది మిత్రులు గురువుగార్ని బాతాఖానీలోకి దించేరు. అందులో ఒకాయన "శ్రీశ్రీగారూ, మీరు మహాకవిగానే కాకుండా విప్లవకవిగా కూడ అఖండ కీర్తి నార్జించేరు. సినిమాల్లోకూడ మంచి పాటలతోపాటు విప్లవ సాహిత్యాన్ని

కూడ రాస్తున్నారు. ఇలాగే సినిమాల్లో స్థిరపడిపోయి సినిమాకవి అయిపోతే మహాకవి అన్న మీపేరుకి భంగం కలిగే ప్రమాదం లేదా?" అని అడిగేరు. ఒక్క సెకెండ్ శ్రీశ్రీగారు కళ్ళుమూసుకొని తెరిచి దమ్ములాగి "నాకు మీరు చేసిన సన్మానం ఏ కవిగా అనుకొని చేశారు?" అని ఎదురుప్రశ్న వేసేసరికి అడిగిన వ్యక్తి మొఖం కాస్త నల్లబడింది. వెంటనే శ్రీశ్రీ "మీరు నాకుచేసిన సన్మానం ఎలా అనుకొని చేసినా ఫరవాలేదనుకోండి. కాని ఒక్క విషయం చెప్పదలచుకున్నా. తెలుగుసినిమా కవినని చెప్పుకోటం సిగ్గుచేటు. సినిమా కవికి సినిమానిర్మాణంలో తనదిగా చెప్పుకోటానికి ఏమీలేదు. అందుకే సినిమారంగం తిమింగిలాలతో నిండిన సముద్రం అన్నాను. ఉదరపోషణకి ఏదో ఒక వృత్తి చెయ్యాలికదా. నాకు సినిమారంగంలో ఎక్కువ అవకాశాలు లభించేయి. నా ఆశయాలని భావాల్ని లక్షలాది ప్రజలకి తెలియచేయటానికి ఈ సినిమాని కూడా ఒక ఆయుధంగా ఉపయోగించుకున్నాను. అవకాశం దొరికిన ప్రతీ సినిమాపాటలోనూ మీకు శ్రీశ్రీ కనిపిస్తూనే వుంటా"దన్నారు.

# బతుకే చీకటాయె

**పల్లవి:**

బతుకే చీకటాయె
తనువే భారమాయె

ఎటు చూచినా
ఎటుపోయినా
ఏదారి – లేకపోయె ॥బతుకే॥

**అనుపల్లవి:**

మమకారాలే దూరమాయె
మంచితనమే నేరమాయె

నాయనువారు లేరాయే
కన్నీరే సెలయేరాయే ॥బతుకే॥

**చరణం:**

గృహమందే అరాచకాలు
దినదినమూ పరాభవాలు

దుర్మార్గుల దురాగతాలు
పొందునులే పరాభవాలు ॥బతుకే॥

---

ఈ పాట "మేనకోడలు" చిత్రంలోనిది.

# బాధలలోనే పయనించి

పల్లవి: బాధలలోనే పయనించి
స్వర్గధామం చేరాను

స్వర్గంలోనే నరకయాతన పడే
మాతృదేవతను చూశాను

అ.పల్లవి: నవ్వలేక ఏడ్చాను – ఏడ్వలేక నవ్వాను
నవ్వూ ఏడుపూ రెండిట నడుమా
నాలోనేనే నలిగాను – నాలోనేనే నలిగాను ॥నవ్వలేక॥

చరణం 1: అమ్మవనీ తెలుసుకొనీ
ఆనందంతో ఏడ్చాను
కొడుకుననీ అనలేక
ఆవేదనతో నవ్వాను
విధికి ఎందుకు ఈ కక్ష?
నాకే ఎందుకు ఈ శిక్ష? ॥నవ్వలేక॥

చరణం 2: నాయిల్లూ నావాళ్ళూ – ఉన్నా
ఒంటరినయ్యాను

తనయునికై తపించే
తల్లికి ఋణపడిపోయాను

కాలం మారక పోదులే మన
మంతా కలియక పోములే ॥నవ్వలేక॥

---

"ఒకే కుటుంబం" చిత్రంలోనిదీ పాట. సంగీతం – కీ.శే. కోదండపాణి. పాడినవారు: కీ.శే. ఘంటసాల.

# నీలోన నన్నే నిలిపేవు

పల్లవి: నీలోన నన్నే నిలిపేవు నేడే
ఏ శిల్పి కల్పనవో - ఏ కవి భావనవో ॥నీలోన నన్నే॥

అనుపల్లవి: ఎల్లోర గుహలో పిల్ల వుంది - నీలో
నండూరి ఎంకి వుంది - నీలో

అలవిశ్వనాథా - చెలి కిన్నెరుంది
మాబాపిరాజు - శశికళ వుంది ॥నీలోన నన్నే॥

చరణము: ఖయ్యాముకొలిచే సాకీవినీవే
కాళిదాసు శకుంతల నీవే

తొలిప్రేమ దీపం - వెలిగించి నావే
తొలిపూల బాణం - వేసింది నీవే ॥నీలోన నన్నే॥

---

"గుడిగంటలు" చిత్రంలోనిదీ పాట. సంగీతం, పాడినవారు. కీ.శే. ఘంటసాల

నేను ఈ పాటలమధ్య రాస్తున్న విషయాలు మా దంపతులిరువురి జీవితంలో జరిగిన విశేషాలేకాని వేరేకాదు ఇందుకు ఎవరితోనూ కంపేరింగ్ లేదు. నీలోనె నన్నే నిలిపేవు నేడే - అనే పల్లవితో కలిపి - "నాలోన, నీవెలితి వీనాడే -" అని అంటూ ఓ చిన్న కథ చెప్పేవారు. ఒకసారి మావారు ట్రెయిన్లో ప్రయాణంచేస్తుంటే వారి చిన్ననాటి ఫ్రెండ్ అకస్మాత్తుగా అదే కంపార్ట్మెంట్లో కలిసేరట. ఆ ఫ్రెండ్కి జోస్యం చెప్పే అలవాటంట. "ఏదీ శ్రీశ్రీ నీ చెయ్యిలా చూప"మని అడిగేడట. "ఇదిగో చూడు, నాకిలాంటి జాతకాల పిచ్చిలేదన్నా"రట. అయినా అతను వదలకుండా చెయ్యి లాగుకొని - అటూఇటూ, కిందకీపైకీ తిప్పి ఆఁ ఊఁ అంటూ "బలే శ్రీశ్రీ బలే. బ్రహ్మాండమైన చెయ్యయ్యా" అన్నారట. "ఫరవాలేదు. త్వరగానే తెల్సుకున్నావన్నా"రట శ్రీశ్రీ. "నిజంగానే చెప్తున్నా వింటారా" అన్నారట. ఊఁ అన్నారట ఈయన ఆయన వెంటనే "మీరొక అమ్మాయిని ప్రేమిస్తారు. పెళ్ళి చేసుకుంటారు. ఆమెవల్ల మీ జీవితం చాలా బాగుండటమే కాదు

సంతానం కూడ కలిగి అమోఘంగా వుంటా"రన్నాడట. "సర్లెండి. ఇప్పుడే నాకు 40 ఏళ్ళున్నాయి. ఇకమీద ప్రేమ ఒకటా?" అని నవ్వేశారట. అతను చిన్నబుచ్చుకొని "పందెంకడతారా? నేను కడతాను. మీకు సంతానం కలిగే తీరుతుంది. మీరు ప్రేమించే అమ్మాయి అదృష్టజాతకురాలై వుంటుం"దన్నారట. "ఆ అమ్మాయి అదృష్టం మాటెలాగున్నా నాకిప్పుడు సంతానం లేకుంటేకద" అన్నారట. ఆమె పెంచుకున్నదన్న విషయం లోకానికి తెల్సిన సంగతి. "నా జాతకం తప్పవటానికి వీల్లే"దన్నారట. మావారు వారితో వాదించటం ఇష్టంలేక మౌనం దాల్చేరట. తర్వాత అతన్ని కల్సుకోవటం అవలేదుట. "అతనే గెలిచాడే పాట్టీ, ఈ ముసిలీ, ఈ పొట్టీ, ఈ బంగారుపిచుక ఎవరి" దని అడిగేవారు. "మీదేనండి" అనినేనంటే తృప్తిగా నవ్వుతూ గట్టిగా దమ్ము లాగేవారు. చివరికి వారిమాటల, జ్ఞాపకాలే నాకు మిగిలేయి.

☆ ☆

# దొంగా దొంగా దొరికేవులే

పల్లవి: దొంగా దొంగా దొరికేవులే! పది
లంగా లొంగావులే!

పొరపాటు తెలిసీ – ఎడబాటు కరిగీ!
తెరచాటు తొలగేనులే॥

అనుపల్లవి: రసరాజ్యమేలే సుల్తానా! నిన్ను
రంజించకుండా వదుల్తానా!

ఇదిగో బిగికౌగిలి – ఈ
జగమే మనలోగిలి॥
నెర నీటులొలికే హోయల్దానా!

చరణం: ముందున్న పచ్చని మైదానం! మన
కందించే వెచ్చని ఆహ్వానం

ఏనాడూ నీవాడనే – నే
నిక మీద నినువీడనే, నీ
కెందుకు లేనిపోని –
అనుమానం॥ ......

గుడిలో మ్రోగింది జేగంట – చెలి
వెన్నెల వెలిగింది నాయింట॥

☆ ☆

# ఎవరు నీవు ఎవరు నేను

పల్లవి: ఎవరు నీవు ఎవరు నేను
అడిగేదెవరు?

అనుపల్లవి: ఎన్నాళ్లీ పయనమో
**ఎవరికీ తెలుసు**
ఎప్పుడో ఎక్కడో – ఇంతే బతుకు
ఏమవుతామో వాళ్లే అడుగు //ఎవరునీవు//

చరణం 1: కానరానిదేవుడు నా–
ముందునిలబడి – మరో
మేను నీకిస్తా అని వరమిస్తే
అంత కరుణ నామీద ఎందుకు దేవా
జన్మచాలు – జాలిచాలు – పోఅంటాను
పోరా అంటాను – పో అంటాను//

చరణం 2: కలసి వున్న జీవితాలు – విడదీస్తావా
మనిషిని మసిచేసి – నీ కసిచూపిస్తావా
ఏకాకిని నేడు నన్ను ఏం చేస్తావు
ఓడిపోయి గుడిలోనె శిలవవుతావు

చరణం 3: సాగిపోవు కాలమాన మాగిపోనిది
జననమరణ చక్రయాత్ర అంతులేనిది
పాపమేదో – పుణ్యమేదో తెలియరానిది
ఇంత శిక్ష దేనికి వెళ్లు వెళ్లు //ఎవరునీవు//

---

ఈ పాట కూడ ఏ సినిమాలోదో తెలీదు. ఇందులో వారి స్వభావం – దేవుడు లేడన్నవారి అభిప్రాయం – కొట్టొచ్చినట్టు కన్పిస్తాయి. వారితో కలిసి దగ్గర దగ్గర 27, 28 సం॥ల పాటు జీవించేను మా ఇరువురి మధ్య సాగిన సంభాషణలు, జరిగిన సంఘటనలూ, మరపురాని స్మృతులూ, ఒక్కొక్కటిగా జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఫేర్‌చేసే పాటలకి అనుగుణంగా వుండేలా రాసి మీముందుంచుతున్నా. మీరంతా ఆదరిస్తారన్న పేరాశే నా ముందంజకి కారణం.

# డేగలాగ వస్తా-తూనీగలాగ వస్తా

పల్లవి: డేగలాగ వస్తా - తూనీగలాగ వస్తా
నేనూగే తూగేవస్తా - మజా చూపిస్తా॥

అ.పల్లవి: పస్తాయించి చూస్తావేం -
బస్తీ ఎరుగనిబావా
చూస్తేలేదు - కాస్తేవుంది
సుస్తీ చేయకు నేస్తం
నీతరపున పందెంవేస్తా
నీతురుపును గెలిపిస్తా
తుపానుమల్లే వస్తా
నేతూలీసోలీ వస్తా మజా చూపిస్తా ॥డేగలాగ॥

చరణం 1: నీకోసమే నే నొస్తి - నిను చూస్తే మోజుజాస్తి
కోవా - బాదం పిస్తా బావా నేతినిపిస్తా
నేమెల్లగ మెల్లగవస్తా మజా చూపిస్తా ॥డేగలాగ॥

చరణం 2: ఎందుకు నీకీ జంకు
అందిస్తా చల్లని డ్రింకు
మనబతుకులు - రవంత సేపు
అంచేత నేడే రేపు
ప్రేమనగర్కి రస్తా - చూపిస్తా నడిపిస్తా
సుడిగాలికి మల్లేవస్తా
జడివానకు మల్లే వస్తా నే
జోరుగ హోరుగ వస్తా
మజా చూపిస్తా ॥డేగలాగ॥

---

"కన్నతల్లి" చిత్రంలోనిదీ పాట.

# ఈలోకం దొంగలసంత

పల్లవి: ఈలోకం దొంగల సంత
ఇక్కడ బల్ టక్కరులంతా
న్యాయానికి చోటేలేదు
మోసాలకు లోటేలేదు ॥ఈలోకం॥

అనుపల్లవి: చిన్నరకం జేబుదొంగలం
నమ్మించి ద్రోహం చెయ్యం
హింసించి ప్రాణం తియ్యం
మనదెంతో మంచి వృత్తంటాం అని
బాజా బజాయించుతాం ॥ఈలోకం॥

చరణం 1: జరుగుతోంది చాలా మోసం
పెరుగుతోంది ఎంతో ద్రోహం
నీతికసలు చోటే లేదు
నిజాయితీ మాటేలేదు
జనమంతా గడాకారులే
జగమంతా దగాకోరులే ॥ఈలోకం॥

చరణం 2: ఎటు చూసినా పెనుఘోరాలే
అడుగడుగున కడుమోసాలే
న్యాయానికి చోటేలేదు
మోసాలకు లోటేలేదు
బడాబడాచోర్లున్నారు
బలే గడేకార్లున్నారు ॥ఈలోకం॥

---

ఇది ఏ పిక్చర్లోదో తెలీలేదు. వారి స్వదస్తూరీలో వుంది. ఫేర్‌చేశాను. ఇది ప్రింట్ అయేలోపల వివరాలకి ప్రయత్నిస్తాను. లేనియెడల రెండవ ముద్రణలో తప్పకుండా వేస్తాను. శ్రీశ్రీగారనేవారు "మనవల్లకాదనుకుంటే ఇక దానిగురించి ఆలోచించకూడదు సరోజా!" అని "అలాగనివూరుకుంటే ఆ మాటకూడ కాలగర్భంలో కలిసిపోతుం"దంటాను నేను. ప్రయత్నించి చూస్తాను. లేనిపక్షంలో కనీసం వారి పాటలైనా పుస్తకరూపంలో వెలువడతాయి. ఈ ఆశతోనే వివరాలు తెలీని వాటినికూడ ప్రింట్ కిచ్చాను.

# మరియాదగా దగా

పల్లవి: మరియాదగా దగా
సరదాకదా సదా ॥మరియాదగా॥

అనుపల్లవి: నేనుకాలెత్తి నిలబడితే
మీరు చేయెత్తి మొక్కకపోరు
ఊరంతటికీ రాజులు మీరు
మీ హృదయాలకు రాణిని నేను ॥మరియాదగా॥

చరణం 1: డబ్బాలో డబ్బులు పడితే
తబ్బిబ్బుల మబ్బులు విడితే
రాత్రిళ్లే పగళ్లుకావా
రాబందులు కోళ్లయిపోవా ॥మరియాదగా॥

చరణం 2: బూతు పాటలకు ఒరవడి పెట్టిన
బుద్ధిమంతులకు జోహార్లు
వారి చలవ మావంటి వారలకు
వెయ్యినూట పదహార్లు

రమ్మనగానే వచ్చేస్తే
ఇమ్మనగానే ఇచ్చేస్తే
ఆగిపోతుంది రొమాన్సు
సాగిపోతాయి క్యూ..క్యూ... ॥మరియాదగా॥

చరణం 3: ఎవరూ తొందరపడకండి
అంతా నాకే వదలండి
ఏలోటూ మీకుండదులెండి
ఇందండీ బిల్ విందండీ॥

చెంపకు చేరెడు కళ్లున్నాయి
కొంపకు బోలెడు దార్లున్నాయి
బందరులడ్డూ - బాదంహల్వా
పసందు అందువా - వారేవా //మరియాదగా//

---

చాలామంది శ్రీ శ్రీ విప్లవసాహిత్యం బాగా రాస్తాడు - ఆకలిమంటలు, పేదలపాట్లు - బీదలబాధలు, ఆరని మంటలు - చీకటి బతుకులు లాంటి పాటలంటే శ్రీ శ్రీ గారే రాయాలని - "ఒక ముద్ర" వేసి అలా కొంతకాలం కొందరు పాటలు రాయించుకున్నారు - అది వేరే విషయంలెండి. "బొబ్బిలి యుద్ధం" తీసిన సీతారామయ్యగారు "జావళి శ్రీ శ్రీ చేత రాయించుదామా" అని మ్యూజిక్ డైరెక్టర్ రాజేశ్వరరావుగారి నడిగితే శ్రీ శ్రీగారి యెదుటనే రాజేశ్వరరావుగారు "శ్రీ శ్రీగారు రాయగలరా" అని అడిగితే "గలనోలేనో చూడం"డని ఒక చక్కని జావళి "నిను చేర మనసాయెరా" అని రాసేసరికి, అందరూ అదిరిపోయారట. శ్రీ శ్రీగారితో మనకి ఫందెం ఏవిట్రా బాబూ? అని చాలామంది నిర్మాతలూ దర్శకులనేవారు. అదేవిధంగా "అమరసందేశం" అనుకుంటాను "సరిగమపదనిస" అని సప్తస్వరాలు వచ్చేలా రాసి "మీరు కావాలని అడగాలేగాని మీకు కావలసిన సాహిత్యాన్ని అందచెయ్యగల"నని చాలా సింపిల్‌గా తేలిగ్గా అనేవారు. ఎంత చిక్కని చక్కని సాహిత్యాన్నయినా ద్వంద్వార్థాలతో రాయగల సరసుడన్న విషయం చాలామందికి తెలీదనే అనుకుంటాను ఈ మాట రాస్తున్నందుకు అందరూ నన్ను క్షమించాలి.

☆ ☆ ☆

# జీవితమే ఒక సెలయేరు

జీవితమే ఒక సెలయేరు – అది సుధాప్రవాహం
సదాప్రయాణం ఆగకసాగే ఆవేగం

అది నా జీవితసంకేతం వేగం వేగం ఆగని వేగం
అది నా జీవితసంగీతం //జీవితమే//

నవభావాలే నిచ్చెనగా రవిబింబం నా నెచ్చెలిగా
ఇలలో స్వర్గం సృష్టిస్తాను కలలు వాస్తవం చేస్తాను

అందుకుంటాను ఆకాశం ఆగిపోదు నా ఆవేశం //జీవితమే//

నాలుగుగోడల చీకటిగదిలో
జీవిత గమ్యం దొరికేనా

పాత నూతిలో కప్పలులాగ
బ్రతికే బ్రతుకొక బ్రతుకేనా//

బరువుగ బ్రతికే జీవచ్ఛవాలు
మరణిస్తేనే మేలు //జీవితమే//

---

నటరాజా ఆర్ట్ క్రియేషన్స్ వారి "ఇల్లేస్వర్గం" చిత్రంలోనిదీ పాట.

# ఈగాలి నిన్నే పిలిచేనే

పల్లవి: ఈగాలి నిన్నే పిలిచేనే
నా కళ్లు నిన్నే వెదికేనే

ఈలోయ నిన్నే పిలిచేనే
ఈగుండె నిన్నే తలచేనే ॥ఈగాలి॥

అనుపల్లవి: ఆనాటి నీకేక – ఇచ్చోటు విడలేక
దిశలందు దిగులొంది కదిలేనే ॥ఈగాలి॥

చరణం 1: నీజాడ కనరాక – నిను వీడిమనలేక
నిర్జీవ శిలవోలె – నిలిచెనే
రావేలా – రావేలా ॥ఈగాలి॥

చరణం 2: ఆరని, తీరని, మారని, శోకములో
దారుణ, నిర్జన లోకపు.....శూన్యములో ॥ఈగాలి॥

చరణం 3: ఆగని గమనముతో
నాకొస ప్రాణముతో
ఒంటరినై వేచెద నీ ధ్యానముతో
రావేలా రావేలా ॥ఈగాలి॥

# ఎరుపెక్కేను చక్కని నీ చెక్కిలి

పల్లవి: ఎరుపెక్కేను చక్కని నీ చెక్కిలి
బరువెక్కేను నాయెదయే మిక్కిలి

నా పెదవుల కదిలేను లే సిగ్గులు
నాయెదయే వేసెను లే మొగ్గలు

అ.పల్లవి: అబ్బ నువ్వు ఎప్పుడూ ఇంతే
కడు సన్నని నీ నడుమే కదలగా
చెలరేగేను కోరికలే వరదలై

నిట్టూరుపు గాడుపులే సోకగా
ఆవేడికి నాతనువే తాళునా

మరినేనుమాత్రం
నినుగాంచిన నిముషంలో – జవ్వని
అనిపించేను నాకేదో ॥ఏదో...॥
మరీ ఇంత చిలిపితనం అయితే ఎలా?....

---

చిత్రం "చిలకాగోరింక."

# ఓ దేవదేవుడా! ఓ జగద్రక్షకా!

పల్లవి: ఓ దేవదేవుడా! ఓ జగద్రక్షకా!
రక్షణలేదు నీ రాజ్యమందు

నేరాలు చేసినా ఘోరాలు చేసినా
శిక్షలులేవు నీసృష్టియందు

అనుపల్లవి: పాపాలు చేస్తారు భక్తులై వస్తారు
మరల పాపాలకే మరలుతారు

టెంకాయ నొకటి కొట్టేసి చేతులు
కడుక్కుంటారు – నిను కొనుక్కున్నట్లు ॥ఓ దేవ॥

చరణం 1: ధనిక వర్గానికీవు సొంతమయినావు
కటిక పేదలదైవము కావు నీవు

దాగిపోగుడిలో తలదాల్చుకొనుచు
తప్పి పైకొస్తే వీళ్లు తంతారు నిన్ను ॥ఓ దేవ॥

ఈ పాట 8–8–1981వ సం॥లో రాశారు.

☆ ☆ ☆

# వెలుగూ నీడా - తీపీ కారం

పల్లవి: వెలుగూ నీడా - తీపీ కారం
ఇంతే సంసారం

ఆలూ మగలూ రాజీపడితే
ఎంతో శృంగారం - ఆ
బ్రతుకే బంగారం

అనుపల్లవి: గాయపు అరచేయి
హాయిగ నీచేయి
మంత్రించి వేసేనులే

కరగిన ఆ హాయి - జ్ఞాపకమైపోయి
నాలోనే దాగేనులే - మారాము చేసెనులే

నీది కోపం - నాది పాపం -
ఈ జన్మకింతేనులే -
ఇంకేల పంతాలులే //వెలుగూ నీడా//

చరణం: ఏదో మది నెంచి - నాతోకలహించి
దూరాన నీవుంటివి
సంగతి గ్రహియించి -
వేదన సహియించి -
వేరింట నేనుంటిని - ఏకాకినై వుంటిని

చీకటైనా - వెన్నెలైనా
నావెల్గు నీవంటిని
నీనీడ నేనంటిని //వెలుగూ నీడా//

---

ఈ పాట అన్నపూర్ణా పిక్చర్స్‌లోనిది.

☆ ☆ ☆

# తూలీ సోలెను-తూరుపుగాలి

పల్లవి: తూలీ సోలెను – తూరుపుగాలి
గాలి వాటులో – సాగెను నావ ॥తూలీ॥

అనుపల్లవి: నన్నే నడిపే దేవతవు నీవే
గాలి విసిరి నీ కురులే చెదరి
నీలి మబ్బులే గంతులువేసే
బెదరు పెదవుల నవ్వులు చూచి
చిరుకెరటాలె – చిందులువేసె

చరణం: చెలికన్నులలో చీకటిచూచి
జాలిజాలిగ కదిలెను నావ
చీకటి ముసరిన జీవితమందె
నీకన్నులలో వెదకెద త్రోవ
హైలెస్సా... హైలెస్సా... హైలెస్సా. ॥తూలీ॥

---

ఈ పాట "అడుగుజాడల"లోనిది. సంగీతం: కీ.శే. వేణు. పాడినవారు: కీ.శే. ఘంటసాల, వసంత.

☆ ☆ ☆

# తీయని యవ్వనరాగం

పల్లవి: తీయని యవ్వనరాగం
చిందిన మైకపు గానం
సిరికన్నులలో వలపు
పరువం పిలిచే పిలుపు

అనుపల్లవి: మల్లెపూల పందిరినీడ
చల్లగాలి ఏమంది - ఏమంది

జల్లులాడే జాలువారే
పరిమళాలు నీవంది - అయితే

మాటుకొమ్మల మాటునచేరి
గండుకోయిల ఏమంది!
పులకరించే పలవరించే -
వలపుపాట నీదంది

సిగ్గుచెందే గులాబి బాల
మూగభాషలో ఏమంది - ఏమంది -
పలుకలేని తెలియరాని -
వింతకోరిక నీదంది - అయితే

కొలనులోని అందాల కమలం
కొసరికొసరి ఏమంది
చెంతచేరి చెలిమికోరే
ఓరచూపులె నీవంది -

నింగిలోన తొంగిచూసే
నీలిమేఘం ఏమంది - ఏమంది
దోరవయసు దాచలేని
జారుపైట నేనంది - అయితే

మాటిమాటికి ఆటలాడే
నీటి కెరటం ఏమంది
పొంగి పొరలే వలపుధాటికి
నిలువలేను నేనంది //తీయని//

---

"అత్తను దిద్దిన కోడలు" చిత్రంలోనిదీ పాట. సంగీతం: కే.శే. వేణు. పాడినది ఎస్. జానకి. రైమ్-అర్థం. నాకెంత నచ్చాయో? మా వారికి గర్వం అంటే ఏవిటో తెలీదు. "ఇటువంటి పాటలు రాయటంలో శ్రీశ్రీది అందెవేసిన చెయ్యి" అనేవారంతా. "ఏవండి రైమ్ చాలా బాగుంది ఇంతకన్నా మీనింగ్ నచ్చిం"దంటే - "ఇలా ఎవ్వడ్రాస్తాడే? శ్రీశ్రీయా మాటలా?" అనేవారు. ఆయననోట అటువంటి మాటలు రానేరావు. రావటం చాలా అరుదు. ఈ పాట నిజంగా వారికి నచ్చింది.

☆ ☆

# కోరికల కుటీరములో

పల్లవి: కోరికల కుటీరములో
చేరి యుందము ప్రియా
మరు మల్లెల నీడా
అందాల మేడా
వెలసింది మనకోసమే కాదా //కోరికల//

అ.పల్లవి: వేయికనుల నీకొరకే
వేచియుంటాను రోజూ
నీలి నీలిమేఘాలా
తేలివస్తాను నీకై//
కాపురాన తేనెలూరె ప్రేమనిండేను
నిండి నోము పండేను //కోరికల//

చరణం 1: చందమామ మనకువేసె
చలువపందిరి
అందు సాటిలేని తనివితీరు
ప్రణయసుందరి –
మరుపురాని మరువలేని
మమతలన్ని డోలలూగ //కోరికల//
ఊహనేడు – ఊయలాయె
హృదయ మూపగనీవు
నిదురపోదుమా మదిలో జో జో జో //కోరికల//

---

"శ్రీమతి" చిత్రంలోనిదీ పాట పాడినవారు: కే.శే. ఘంటసాల, పి. సుశీల.

☆ ☆ ☆

# ఈ సమరం -
# కలియుగ భారత సమరం

ఈ సమరం – కలియుగ భారత సమరం
ఎన్నికల రణాంగణాన ఎదిరించిన
కురుపాండవ భీషణ సమరం
కలియుగ భారత సమరం

వారసత్వ యుక్తులకూ
ప్రజాస్వామ్య శక్తులకూ
సాగుతున్న నరదానవ – సంకులసమరం

గద్దెమీద కలకాలం – కాపురాలు వెలిగించే
పదవీ వ్యామోహపరుల – పడదోసే సమరం –
భారత సమరం – కలియుగ భారత సమరం –

అదిగదిగో వినాయకులు – అతిరథులు – మహారథులు
బురుజుమీద గుడ్లగూబ – జీపుమీద ఇంద్రయ్య –

కుతంత్రాల గుంటనక్క – ట్రక్కుమీద దాసుగారు
విశ్వాసపు వేటకుక్క – ట్రాక్టరుపై కేశవులు –

పొగరుబోతు – వదరబోతు – బుద్ధిలేని చక్రవర్తి
చక్రవర్తి జిందాబాద్ – ఇంద్రయ్య జిందాబాద్

భారత ఘన రణసారథి – చక్రధారి గోపాలుడు
శత సహస్ర కార్మికజన సైన్యాధ్యక్షుడు – భీముడు

త్యాగదీక్ష రూపొందిన – ధన్యజీవి అర్జునుడు
నవసమాజ – సమసమాజ – నాయకమణి – ధర్మరాజు

ధర్మరాజ్ – జిందాబాద్
గోపాలం – జిందాబాద్ ॥ఈ సమరం॥

ప్రజలంటే గొర్రెల మందలు
పైసాకే దాసోహం అందురు

ప్రజలంతా హక్కులు తెలియని
రాతిదిమ్మలే - కీలుబొమ్మలే

ప్రజాశక్తి ఒక అగ్నిపర్వతం
పగిలిందో ఎదురే లేదు

ప్రజాబలం ఒక మహాసముద్రం -
ఆ ధాటికి తిరుగేలేదు

ఈ సమరం కలియుగ భారతసమరం
ఎన్నికల రణాంగణాన - ధర్మానికి విజయం

వారసత్వ యుక్తులకు పరాజయం
ప్రజాస్వామ్య శక్తులకు మహోదయం

ఇది విజయం -
సత్యానికి - ధర్మానికి
ఘనవిజయం

---

ఇది "కలియుగ మహాభారతం" చిత్రంలోనిది.

☆ ☆ ☆

# ఈ పుణ్యభూమి మనది

ఈ పుణ్యభూమి మనది
ఈ మాన్యసీమ మనది
ఈ రత్నగర్భ మనది –
ఈ అన్నపూర్ణ మనది – ॥వందేమాతరం॥

అమరజీవులను –
సమర యోధులను –
కన్నతల్లి యిది – మనదేశం –
క్రాంతిశోధకుల – కార్యసాధకుల –
కల్పవల్లి యిది మన దేశం – ॥వందేమాతరం॥

ఎన్నాళ్ళింకా ఈ నైరాశ్యం
ఇంకెన్నాళ్ళో – ఈ పరదాస్యం
పెళా పెళా పెళ చెలరేగాలి
ప్రజాసముద్ర ప్రభంజనం
జడిగా, వడిగా, కొనసాగాలి
స్వరాజ్య సంగర మహోద్యమం ॥వందేమాతరం॥

☆ ☆

# ఆగవోయి - ఆగవోయి - త్యాగం ఇదియేనా?

పల్లవి: ఆగవోయి - ఆగవోయి
ఆగవోయి - ఆగవోయి

త్యాగం ఇదియేనా?
హృదయం శిలయేనా?
ఏల యీ మోసం,

అనుపల్లవి: ఇల్లాలి మనసు కల్లోలమాయె
ఏలా యీ మోసం - ॥ఏది నీహృదయం॥

చరణం 1: నీవు కట్టినతాలీ నిగనిగమెరిసేను
కనికరమున గాజులు
కరముల మెరిగేను
ఆనాటి పారాణి
ఆనవాలు మిగిలేను

ఆ జాలి - ఆ మమత - నీకు లేకపోయెనా?
॥ఏదీ నీహృదయం॥

చరణం 2: నిలువనీడ నిచ్చావు -
నగలు చీర లిచ్చావు -

బాధ్యత అంతతో
తీరేనని తలచావా అంతేనా
చదివిన నీ చదువంతా వ్యర్థమా ॥ఏదీ నీహృదయం॥

చరణం 3: రేయిపగలు కంటికి రెప్పగా
మేను – మనసు – మాటా ఒకటిగా
జీవితమంతా చెంత నిలిచి వుండాలి
త్యాగమదే – త్యాగమదే ॥ఏదీ నీ హృదయం॥

చరణం 4: మూడు ముళ్ళు వేయుటయే
త్యాగమని తలచితివా
ఏదీ నీహృదయం – త్యాగం ఇదియేనా?

హృదయం శిలయేనా? ఏలా యీ మోసం
కలకంఠి కన్నీరొలికినచో
గరళమై పోవును – అమృతమే
మరువకుమా

చరణం 5: కన్నులున్న అంధుడవై
బాధపడనేలా

కన్నులు లేని దీనురాలి
గాధలు వినలేవా

మగువను నీదానిని చేసుకో
మనసును నీదారికి తీసుకో

మానవ రూపంలో
దేవునిగా మారిపో

---

బాబూ మూవీస్‌వారి "మంచిమనసులు" చిత్రంలోనిదీ పాట. సంగీతం: కె. వి. మహదేవన్. పాడినవారు: పి. సుశీల. దర్శకత్వం: ఆదుర్తి.

☆ ☆ ☆

# లేనోళ్లం-డొక్కలు కాలేవోళ్లం

పల్లవి: లేనోళ్లం - డొక్కలు కాలేవోళ్లం
కాని -
సేతకానోళ్లం - మేము కాముర్ -
భటాచోర్ -

అనుపల్లవి: దేముడెనక దాక్కుంటే
భూమి పుట్టలాక్కుంటే
మాకేమని ఊరుకోం
తోకముడిసి జారుకోం
సీము నెత్తురా మాత్రం
లేనోళ్లం - మేముకాముర్ -
ఖబడ్దార్

చరణం 1: గుడిలోన పందికొక్కులవంటి పూజార్లు
వెలుపల వందవందల బికార్లు

గుడిలోన జరిగేవి కొంగజపాలెన్నో
బైట సాగేది పాపాల బ్రతుకు

గుడిలోన భిక్షుకుల ముడుపు చెల్లింపులు
లంచాల మయమీ ప్రపంచమెల్ల

గుడిలోన సుడిరేగు పొడి పొడి మంత్రాలు
గుడిబైట తడిగుడ్డ గొంతుకోత ॥లేనోళ్లం॥

చరణం 2: మంత్రాలు చదివితే -
మరుజన్మ పండునా
లంచాలు చెల్లించితే
ముక్తిసిద్ధించునా
భక్తాగ్రగణ్యుల భ్రమలుకాని

శరకోపమెత్తితే
జబ్బులు కుదురునా –
మూఢవిశ్వాసాల మురికిగాని

ధూపదీపాలతో పాపాలుకాలునా
విజ్ఞానహీనుల వెఱ్ఱిగాని
కర్మవాదాల వక్రతలుగాని
ముడుపు చెల్లించితే – ముక్తి సిద్ధించునా

కనుక మన పరలోక చింతన – మొకింత
దూరముగ త్రోసి – యిహమందు దుఃఖములకు

కారణాల నన్వేషించి కార్యదీక్ష
పూనినపుడే సమాజ విమోచనమ్ము ॥లేనోళ్లం॥

☆ ☆ ☆

# నారాణి కనులలోనే

పల్లవి: నారాణి కనులలోనే
ఆనాటి ఈ కలలుదాగే
వూరించు తావి దినాలే
ఈ రేయి పిలువసాగే ॥నారాణి॥

అ.పల్లవి: నగుమోము చూడబోయి
నినుచేరగా నాటిరేయి
నను క్రీగంటేకని ఆవెంటనే
చని దూరాన దాగుంటివే ॥నారాణి॥

చరణం 1: సిగలోన మల్లెపూల
సవరించ బోవువేళ
మదిగిలిగింతగా చెయి
విదలించగా – యెద
నినుగోరి పులకించెనే ॥నారాణి॥

చరణం 2: పడకింటి శయ్య చెంత
నీమేను తాకినంత
వనగీతాలలో – జలపాతాలలో
నవరాగాలు మ్రోగేనులే ॥నారాణి॥

☆ ☆ ☆

# ఇంతేకద యీలోకంతీరు

పల్లవి: ఇంతేకద యీలోకంతీరు!
అంతా తెలిసినవారే లేరు!

బ్రతుకే పడవ – పగిలే కడవ!
చుట్టూ ఉన్నది కన్నీరు! ॥ఇంతేకద॥

అనుపల్లవి: కలిసి మెలిసిన చెలిమినే బలి!
చేసేనే ధనదాహము!

మనిషి మనిషిని నమ్మినపుడే!
జరిగెనే పెనుద్రోహము!

మంచితనమే మాయమైతే!
మాసిపోదా న్యాయము! ॥ఇంతేకద॥

చరణం: కటిక చీకటి రేయికైనా!
కడకు వేకువ వెలుగునే!

బడలి సాగె నదికి కూడ!
కడలి కౌగిలి దొరుకునే!

బడుగు మనిషీ నీకుమాత్రం!
బ్రతుకు దారే కానరాదు! ॥ఇంతేకద॥

---

స్వతంత్రా ఆర్ట్స్‌వారి చిత్రంలోనిదీ పాట. 25-12-1978 వ తేదీన విజయాగార్డెన్స్‌లో రికార్డింగ్ అయింది.

☆ ☆ ☆

# ముసిముసి నవ్వుల

పల్లవి: ముసిముసి నవ్వుల రుసరుసలూ
కసరులు, చెవిలో - గుసగుసలూ

నడివయస్సులో శృంగారం
తడబడినడిచే సంసారం ||ముసిముసి||

అనుపల్లవి: చేతిగాయమే బాధించగా - నీ
గాజుల చేతులు మంత్రించెగా
నాటి వేడుకల జ్ఞాపకము
నేటి వేదనకు కారణము

కొంత వినోదం - కొంత విచారం
ఇంతే సంసారం - కాదంటే అపచారం ||ముసిముసి||

చరణం: సన్నజాజులూ - సంపెంగలూ - అవి
పెంచును మమతలు రెండింతలు

సన్నజాజులది చల్లదనం
సంపెంగపూలది - వెచ్చదనం

వెలుగూ, నీడా - తీపీ కారం
ఇంతే సంసారం, వికసించే మందారం ||ముసిముసి||

---

"పెళ్లీడుపిల్ల" చిత్రంలోనిదీ పాట. ఈ పాట 19-1-1982లో రాసేరు. సంగీతం: యమ్. ఎస్. విశ్వనాథంగారు. పాడినవారు: పి. సుశీల. శ్రీ శ్రీగారికి మల్లెపూలంటే చాలా యిష్టం. వారితోపాటు ఏవూరైనా వెళ్ళి బజారు వెళ్ళి ఏవైనాకొంటే వారికెంత కోపమో చెప్పలేం. నాకు పూలచెట్లంటే పంచప్రాణాలన్న సంగతి వారికి బాగా తెలుసు. నేను నర్సరీకి వెళ్లి చెట్లు కొనుక్కొని వస్తానంటే "నీ ఇష్టం. నాకు చెప్పకు సరోజా" అనేవారు. ఒకసారి కాకినాడలో వారికి సన్మానం జరిగింది. ఆ రోజు రాత్రి డాక్టరమ్మగారింట్లో మాకు బ్రహ్మాండమైన విందు. వాళ్లింట్లో అనేక రకరకాల రంగుల్లోవున్న

గులాబీపూల గోలేలు చూసి నాకు మతిపోయింది. నా సంగతి వదలండి, శ్రీ శ్రీగారే ఒక గోలెం దగ్గరికి వెళ్ళి పువ్వులు చేత్తో పట్టుకొని "సరోజా!" అని ఒక కేకవేశారు. చుట్టూ చాలామంది వుండటంవల్ల శ్రీ శ్రీగారి పిలుపుని నాతోపాటు అందరూ విని అక్కడికి చేరేరు. "సరోజా! ఈ గులాబీలు చాలా బాగున్నాయికదూ? నీకు కావాలేవిటి పొట్టి పట్టూ, అన్నారు. అంతే! ఒక్క గంతేశాను. వెంటనే డాక్టరమ్మతో "మా ముసిలికి పూలచెట్లంటే చాలా ఇష్టం అండీ. అది గులాబి బేబి" అన్నారు. అంతేనండి బాబు, మేం వు బండి ఎక్కేసరికి మా ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో తెలీకుండా విరగపూసిన పువ్వులతో అరడజను గులాబిచెట్లు మమ్మల్ని ఆహ్వానించేయి. ఆ డాక్టరమ్మగారి పేరు మరచిపోయాను, క్షమించాలి. వారిపేరు తెలుసుకొని సెకండ్ ఎడిషన్‌లో వేస్తాను. నేనూ సాయంకాలంవేళల్లో మా యింట్లో వున్న మల్లెచెట్లకి నీళ్లుపోస్తూ వుంటే బాగా పూచిన పువ్వుల్ని కొమ్మతో సహా వంచి వాసన చూసేవారు. ఒక్కోసారి తనకి ఘనసైనప్పుడల్లా ట్యూబ్‌లైట్ వేసుకొని మల్లెపూలు కోసుకొని బాగా వాసన చూసుకొని నా చేతిలో పోసేవారు. నేను చెట్లకి నీళ్లు పోసినపుడు ఆ నీళ్లతో కాళ్లు తడుపుకుంటూ, తనూ నీళ్లు పోస్తూ చెట్లకి నీళ్లు పోయటం పూర్తయేవరకూ, చంటిపిల్లాడిలా తెగ అల్లరి చేసేవారు. వారి జ్ఞాపకాల్లో ఒకటిగా ఆ మల్లెచెట్టు ఇప్పటికీ బాగా పెరిగివుంది. కాని పూలు పుయ్యటం అనవసరం అనుకుందేమో – నాలాగే అదికూడ మోడై, మొద్దుగా వుంది.

☆ ☆ ☆

# పెనుచీకటాయె లోకం

ఆడ: పెనుచీకటాయె లోకం
చెలరేగే నాలో శోకం
విషమాయె మా ప్రేమ
విధియే పగాయె //పెను//

మగ: పెనుచీకటాయె లోకం - చెలరేగే నాలో శోకం
విషమాయె మా ప్రేమ - విధియే పగాయె

ఆడ: చిననాటి పరిణయగాధ
ఎదిరించలేనైతినే
ఈనాటి ప్రేమగాథ - తలదాల్చలేనైతినే

కలయే నశించిపోయే - మనసే కృశించిపోయే
విషమాయె మా ప్రేమ - విధియే పగాయె//

మగ: మొగమైన చూపలేదే
మనసింతలో మారెనా

నా ప్రాణసతివని తెలిపే
అవకాశమే పోయెనా

తొలినాటి కలతల వలనా
హృదయాలు బలికావలెనా

విషమాయె మా ప్రేమా -
విధియే పగాయె

అన్నపూర్ణావారి "మాంగల్యబలం" లోనిదీ పాట. సంగీతం: కే.శే.వేణు. పాడినది: పి. సుశీల, కే.శే. ఘంటసాల.

☆ ☆

# ఓ సుకుమార - ననుచేర

పల్లవి: ఓ....సుకుమార ననుచేర
(ఆడ) రావోయి ఇటు రావోయి

నిలువగలేని వలపులరాణి
నీకొరకే తపించునులే ॥ఓ....సుకుమార॥

మగ: ఓ....జవరాలా ప్రియురాలా
ఈనాడే మనదే హాయి

చనువుగ నేడు - నీ చెలికాడు
నీదరినే సుఖించునులే ॥ఓ...జవరాలా॥

ఆడ: కోటి కిరణములు కోరినగాని
భానుని చూడదు - కలువచెలి

వెన్నెలకాంతి వెలిగినవేళ
విరియునుగా విలాసముగా

నిలువగలేని వలపులరాణి
నీకొరకే తపించునులే ॥ఓ....సుకుమార॥

మగ: వేయి కనులతో వెదకినగానీ
తారకు జాబిలి - దూరమేగా

కలువల రాణి - వలపుల లోనే
కలకలలాడి - చేరునుగా

చనువుగ నేడు నీ చెలికాడు
నీదరినే సుఖించునులే ॥ఓ...జవరాలా॥

---

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి "భార్యాభర్తలు" చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# మంచిని పెంచాలి

పల్లవి: మంచిని పెంచాలి - తీయని
మమతలు పంచాలి
మనిషిని మనిషిగ ప్రేమించి
ఒక కరుణాదీపం - వెలిగించి //మంచిని//

అనుపల్లవి: నీలో నాలో మనసుంది - అది
తన లాభాలే తలచింది

స్వార్థపిశాచిని కొలిచీ, కొలిచీ
పశువే నయమనిపించింది

మదిలో స్వార్థం మరచిననాడే
బ్రతుకే సార్థకమవుతుంది //మంచిని//

చరణం 1: భవనాలేలా పదివేలు
ఒక యింటిని నిలబెడితే చాలు
జలకాలాడగ పన్నీరేలా
తుడవాలొక్కరి కన్నీరు

పగతో, వగతో, రగిలేకన్నా
పండించాలి స్నేహాలు //మంచిని//

చరణం 2: హాలాహలమే కబళించాడు
త్యాగామృతమే కురిపించాడు

ఆతని బ్రతుకే - ఒరవడిగా
ఆతని స్మృతియే మనుగడగా //మంచిని//

---

జగజ్జననీ ప్రొడక్షన్స్‌వారి చిత్రంలోనిదీపాట. ఎ.వి.యమ్.లో 11-2-1976 న రికార్డింగ్ జరిగింది. రాయటం 28-1-1976 న రాసేరు. పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం.

☆ ☆ ☆

# ఉన్నానా లేనా-నేనున్నానా లేనా?

పల్లవి: ఉన్నానా లేనా - నే
నున్నానాలేనా! అస
లుండీ లేకున్నానా ||ఉన్నానా||

అనుపల్లవి: సూదులు గుచ్చే సూర్యకాంతిలో
నాబ్రతుకే - ఒక నిట్టూర్పు
వేదనపెంచే - పెనుచీకటిలో
లేదు లేదు ఓదార్పు ||ఉన్నానా||

చరణం 1: తోడూనీడకు దూరంగా
ఒంటరితనమే భారంగా
విశాల విశ్వమే శూన్యంగా
విషాద జీవితమెన్నాళ్లు? ||ఉన్నానా||

చరణం 2: మిణుగురులే నా నేత్రాలు
మింటి చుక్కలే నేస్తాలు - నడి
సంద్రంలో నాకను నేను
చేరే తీరం లేనేలేదు ||ఉన్నానా||

---

ఈ పాట పిక్చర్లో ఉందని అనుకోను. వారి దస్తూరీతో రాసిన పేపరుంది. నాకు వచ్చింది. ఈ పుస్తకంలో వేశాను. ఇలాగే మొదటిసారిగా, ముద్రణకి పంపిస్తున్న వారి సినిమాపాటలన్నిటిలో కొన్నికొన్నింటికి సరియైన చిత్రంపేరూ, కంపెనీపేరు దొరకలేదు. రెండవ ముద్రణలో అవన్నీ వేయగలనన్న నా శాయశక్తులా ప్రయత్నించి సరియైన పేర్లు సంపాదించగలనన్న నమ్మకం వుంది. ఇందుకు పాఠకుల సహాయంకూడా నాకు వుంటుందని, నా ఈ తప్పుల్ని మన్నిస్తారన్న ధైర్యంతో మీ ప్రోత్సాహాన్ని ఆశిస్తూ ముందుకు నడుస్తున్నాను.

☆ ☆ ☆

# ఈ హుషారులో ఈ నిషాలలో

పల్లవి: ఈ హుషారులో - ఈ నిషాలలో
ఇలా, ఇలా, మునిగిపోవనీ
కలలో అలనై తేలనీ

ఈ హుషారులో - ఈ షికారులో
ఇలా, ఇలా, కరిగిపోవనీ
యెదలో నిజమే - తేలనీ ॥ఈ హుషారులో॥

అనుపల్లవి: నీకన్నులలో ఏదో వింత మైకమూ ఆ
మైకంలో దాగె - వలపుల లోకమూ
నిజమని నమ్మనా
కథయనుకొందునా ॥ఈ హుషారులో॥

చరణం: కథలుకాదు - కలలుకాదు
నీవునేను - వేరుకాదు
విరితేనె ధార జాలువారు మాటలు
ఆ మాటలలో విరిసే - వలపులతోటలు

అవి మన సొంతము
పద విహరింతము

తమాషాలుచాలు చాలు
బలే మోసగాడివే ॥ఈ హుషారులో॥

---

"బలే మోసగాడు" చిత్రంలోనిదీ పాట. సంగీతం కే.వి. సత్యం. పాడినవారు యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల. ఇది గమ్మత్తయిన పాట. అంటే మా జీవితంలో ఉద్బుదమైనదన్నమాట. పాటకాదు, నిషా అన్నమాట. మావారు నన్ను అనేక పేర్లతో పిలిచినట్టే నేను అలా పిలిచినరోజున "నా పొట్టికి నామీద అంత లవ్వన్నమాట" అనేవారు. తాగకుండా వున్నప్పుడు

వార్ని మోసగించటం ఎంత సులభమో తాగినప్పుడు అంత కష్టం. కష్టంవేకాదు అది అసంభవం అనే గట్టిగా చెప్పగలను. తాగినపుడు మనం ఆడేమాటా చేసేపనీ తెల్లారగానే ఏ ఏ టూ జడ్ కరెక్ట్‌గా చెప్పేవారు. "వెన్ ది డ్రింక్ ఈజ్ ఇన్ దెన్ ది ట్రూత్ అవుట్" అనేవారు. ఎంతకాలం అయినా జరిగినదంతా పూసగుచ్చినట్టు చెపుతూవుంటే తాగి శ్రీశ్రీ పుల్లా లేక తాగకనా అనిపించేది. నిషాగురించి, వారి కథలు చెప్పాలంటే ఒక పుస్తకమే అవుతుంది.

# ఓహోహో సుందరీ

పల్లవి: ఓహోహో సుందరీ - నీ
అందమేనా ఈవసంతం

ఆనందరాగిణీ - అనురాగవాహినీ
కవ్వించే జవ్వనీ - నీతీరులేకాదా అనంతం ॥ఓహోహో॥

అనుపల్లవి: కనులందు దాచినావే - కాంతులూ
అవియే నాపూచిన - చేమంతులూ

వికసించే నవ్వులే విరజాజి పువ్వులా
కవ్వించే జవ్వనీ నీహావ భావాలే అనంతం ॥ఓహోహో॥

చరణం: కొసరే నీపాటలో లాలింపులే
కోయిలా గొంతులోని యింపులా

కులికే నీ సొంపులే - సెలయేటి వంపులా
కవ్వించే జవ్వనీ - నీగానరాగాలే అనంతం
ఓహోహో - సుందరీ - నీ అందమే
నా యీ వసంతం ॥ఓహోహో॥

---

రఘురామ్ ఫిలిమ్స్‌వారి "తండ్రులూ కొడుకులూ" చిత్రంలోనిదీ పాట. నిర్మాత, దర్శకుడు: హేమాంబరధరరావు. సంగీతం: కీ.శే. టి. చలపతిరావు. పాడినవారు: పి. బి. శ్రీనివాస్. ఇక్కడ పి.బి.ఎస్. గురించి రెండు మాటలు రాయాలి. ఆయన రికార్డింగ్‌లో వున్నారంటే పెళ్ళిసందడన్నమాటే. హడావిడికి అల్లరికి అలికిడికి అతనొక్కరు చాలు - పదిమంది పెట్టు. మా డబ్బింగ్ చిత్రాలలోకూడ చాలా పాటలు పాడేరు. తను పాడబోయేపాటే కాదు - ఏ సినిమా పాటలైనా సరే, అతనికిచ్చి కర్ణాటక క్లాసిక్‌లో పాడమంటే చాలు, గమకాలతో సహా సంగతులు వేసి చక్కగా పాడి పొట్టలు పగిలేటట్టు అందర్నీ నవ్వించేసేవారు. నేనైతే నవ్వలేక చచ్చేదాన్ని. పి.బి.ఎస్. రికార్డింగ్ అయితే మాత్రం శ్రీశ్రీగారిచేత హాయిగా నవ్వించేవారు. అతని జోకులకి శ్రీశ్రీగారు విరగబడి నవ్వేవారు. నాకు తెలిసి శ్రీశ్రీచేత బాగా నవ్వింపచేసిన వ్యక్తి పి.బి.ఎస్‌గారే. మంచి ప్రోత్సాహం ఇచ్చే స్వభావంగల మంచి మనిషి. మా ఇద్దరికీ మంచి మిత్రులు - మా అభిమానికూడ.

# ధారుణి రాజ్యసంపద

ధారుణి రాజ్యసంపద ముదంబున
కోమలి కృష్ణజూచి
రంబోరు నిజోరు దేశమున
నుండగ పిల్చిన యుద్దురాత్ము
దుర్వార మదీయ బాహుబల
దర్పిత చండగదాభి ఘాత
భగ్నోరు తరోరు జేయుదు
సుయోధను - నుగ్ర రణాంతరంబునన్

ఈ పద్యం, సురేష్ ప్రొడక్షన్‌వారి "రాముడు - భీముడు" చిత్రంలోనిది. సంగీతం: కే.శే. పెండ్యాల. పాడినది: మాధవపెద్ది.

☆ ☆ ☆

# బి.ఏ.చదివాం-ఎం.ఏ.చదివాం

పల్లవి: బి.ఏ. చదివాం, ఎం.ఏ. చదివాం
అమ్మా నాన్నకు – కాకున్నాం
ఊరూ పేరూ లేకున్నాం
అయినా ఇంకా బతికే వున్నాం //బి.ఏ.చదివాం//

అనుపల్లవి: వందల గుడిసెలు పడిపోతున్నా
డజన్ల మేడలు లేస్తూ ఉన్నాయ్
పరువు ప్రతిష్ఠలు – తరుగుతు వున్నా
ధరలూ కరువూ పెరుగుతు వున్నాయ్
జేబులు కాళీ – బ్రతుకులు కాళీ
అయినా ఇంకా బ్రతికే వున్నాం. //బి.ఏ.చదివాం//

1వ చరణం: నడి బజారులో నలుగురి ముందు
హత్య జరిగినా సాక్ష్యం బందు
ఎవరి నడిగినా నిజం పలకదు
ఎంత వెదికినా న్యాయం దొరకదు
అంతా మోసం అనుకున్నాం
అయినా ఇంకా బతికే ఉన్నాం //బి.ఏ.చదివాం//

2వ చరణం: కాలేజీల్లో చదువుల్లేవు
దుకాణాలలో సరుకుల్లేవు
గుడిలో దేవుడు గైరుహాజరు
అర్జీలన్నీ బుట్ట దాఖలు
బస్సూ ట్రెయినూ – మిస్సయి పోయాం
అయినా ఇంకా బతికే ఉన్నాం //బి.ఏ.చదివాం//

పై పాట మరోరకం – తరువాయి పేజీలో

పల్లవి: బి.ఏ.చదివాం – ఎం.ఏ.చదివాం
అమ్మానాన్నకు కాకున్నాం
ఊరూపేరూ లేకున్నాం
అయినా ఇంకా బ్రతికే ఉన్నాం ॥బి.ఏ.చదివాం॥

అనుపల్లవి: ఆశయాలు మనకెన్నో ఉన్నాయ్
ఆకాశంలో విహరిస్తున్నాయ్
ఎగరాలంటే రెక్కలులేవు
ఏంఫాయిదా – భాయీజాన్ ॥బి.ఏ.చదివాం॥

చరణం 1: ధరలూ, జనాభా, నిరుద్యోగమూ
కరువూ, బరువూ, కష్టం పెరిగాయ్
అబ్బా, ఎంతటి అభివృద్ధో అని
జబ్బుచరచరా – భాయీజాన్ ॥బి.ఏ.చదివాం॥

చరణం 2: నడిబజారులో నలుగురిముందు
హత్య జరిగినా సాక్ష్యం బందు
ఎంతవెదికినా న్యాయం దొరకదు–
ఏం చెయ్యాలిర – భాయీజాన్ ॥బి.ఏ.చదివాం॥

చరణం 3: కాలేగుడిసెలు – కూలుతువుంటే
లేచే మేడలు – లేస్తూవున్నాయ్
పస్తులిక్కడా, విందులక్కడని
బాధపడకురా – భాయీజాన్ ॥బి.ఏ.చదివాం॥

చరణం 4: కళాశాలలో జ్ఞానం వెలగదు
దుకాణాలలో సరుకులు దొరకవు
గుడిలో దేవుడు – గైరుహాజరని
దిగులెందుకురా – భాయీజాన్ ॥బి.ఏ.చదివాం॥

---

ఉదయినీ పిక్చర్స్‌వారి చిత్రంలోనిదీ పాట. ఈ పాటను 16–6–1975 లో మూడు రకాలుగా రాశారు. ఒక రకాన్ని "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" శ్రీశ్రీ సినిమా పాటల సంకలనంలో వేశాం. మిగిలిన రెండు రకాలను ఈ సంకలనంలో చేర్చాం – ప్రచురణకర్తలు.

# పొద్దయిన తిరగకముందే

పల్లవి (మగ): పొద్దయిన తిరగకముందే –
చుక్కయినా పొడవకముందే –

రెక్కలు కట్టుకుని – ఎగిరొచ్చావేమయ్యా
కిటికీతీసి చిటికెవేసి
అదలించేవు – నన్నడగొచ్చావు
ఎవరూలేని సమయంచూసి
ఏమని వచ్చేవు – నీవేమిటి తెచ్చావు॥

ఆడ: అన్నెంపున్నెం ఎరగని – నన్ను
అలుసెందుకు చేస్తావు
బలేమావయ్యా – నేను
రానుపోవయ్యా॥

మగ: చనువిస్తే చాలు – చిలిపితనాలు
చూపెదవేలా – నీ
గుణాలు మానవదేలా

ఆడ: విలాసాలకి – వేళాపాళాలేదా
పదుగురికంటా పడితేతంటా
పరువే పోవుకాదా బలేమావయ్యా
నేను రానుపోవయ్యా

మగ: కడదాకా నిను విడువను – నేనని
కబుర్లు చెప్పేవు – ఏవో
కథలే అల్లేవు –

ఆడ: కమ్మని మాటలు నమ్మి
తీయని కలలే కన్నాను
నీ వలలో పడ్డాను

మగ: కళ్లకు నచ్చిన కానుకలిస్తే
కాదని నేనంటానా?

ఆడ: బలేమావయ్యా - నేను రానుపోవయ్యా ॥పొద్దయిన॥

---

"తోడికోడళ్ళు"లోనిదీ పాట. సంగీతం: కే. శే. వేణు. పాడినది: జిక్కి (కృష్ణవేణి). పొద్దు అంటే నాకిక్కడ ఓ సంఘటన జ్ఞాపకం వస్తోంది. ఉదయం 10 గంటలకి వారిని లేపటానికి వెళితే "ఉండు నాయనా! ఇంకా తెల్లారనిదే" అనేవారు. 11 గంటలకి టిఫిన్. మధ్యాహ్నం 2, 3 గంటలకి భోజనం. మూడే అయిటెమ్స్. ఒక కూర, చారు, పచ్చడి, మజ్జిగ మామూలే. అదికాక మీరు ఎన్నిరకాలు చెయ్యండి - చేసిన వెరైటీల లిస్ట్ తెలుసుకున్నాక అందులో మూడే మూడు ఎంచుకొనేవారు. రాత్రి 10-11 గంటలమధ్య భోజనం. ఇది వారి కరెక్ట్ టైమింగ్సన్నమాట. పొరపాటున ఉదయం 9 గంటలకి లేపి టిఫిన్ పెడితే ఈరోజు తెల్లారగట్టే టిఫిన్ చేసేశాను అనేవారు. పనిలేకుండా తీరిక చిక్కినరోజుల్లోనే సుమండీ! పనివుంటే ఆయనతో సొల్లేం - గమ్మత్తుగాలేదూ?

☆ ☆ ☆

# ఈ పాటకు ఒకటే పల్లవి

పల్లవి: ఈ పాటకు ఒకటే పల్లవి – బాధ
ఈ ప్రపంచాన మానవులందరి – గాథ

అనుపల్లవి: అదిగో చూడు పసివాడు
కదిలే ఎముకల గూడు
ఆకలి తింటూ ఉన్నాడు
అలో లక్ష్మణా అంటున్నాడు ఓ....

చరణం 1: అదిగదిగో చిన్నమ్మి
బతుకుతోంది తన ఒళ్లమ్మి
ఆమె ఇంకిన సెలయేరు
ఆరిపోదామె కన్నీరు ॥ఓ డామిట్....॥

చరణం 2: అదిగో చితిలో కలవాడు
అదికూడా తనదంటాడు
మనిషికి మనిషే పగవాడు
గతమే అతనికి ఉరితాడు ॥ఓ గాడ్....
ఒరేయి చూశానురా॥

---

శ్రీ సత్యసాయిచిత్రావారి చిత్రంలోనిదీ పాట – పాడినవారు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం. ఈ పాటని 31-3-1975 లో రాసేరు.

# ఈయింటిలో దీపమై

పల్లవి: ఈయింటిలో దీపమై హాయిగ
నాకంటిలో పాపవై జాలిగ
నానీడలో నిదురపోరా
నాగుండెలో నిలిచిపోరా ॥ఈయింటిలో॥

అనుపల్లవి: దగా నిండురేయిది – దయాదృష్టి లేనిది।
విలాసాల కోసమే
ధనం జల్లు వారిదీ
విడనేవిడదు – విషాదాల చీకటి
విలాపాలగాథ – వేధించు . బాధ –
భరించాలి నాయనా ॥ఈయింటిలో॥

చరణం: ప్రపంచాన మోసమే
నటించే దినాలే
నిశీథాన శోకమే
దహించే క్షణాలలో
వెలిగే రవియై
విరాజిల్లు పాపవై
ప్రమోదాల భావి
పండించగోరి
జనించావు నాయనా ॥ఈయింటిలో॥

---

శ్రీదుర్గా మూవీ ఎంటర్‌ప్రైజెస్‌వారి చిత్రంలోనిదీ పాట. 9–1–1982 వ తేదీన రికార్డింగ్ అయింది. పాడినది: ఎస్. జానకి.

☆ ☆ ☆

# ఏం అన్ననాడే

పల్లవి: ఏం అన్ననాడే ఇంక నిన్ను
ఆపువారు లేరే

నేనే అన్ననాడే - లొంగి
బ్రతికేవాడే - లేడే

అనుపల్లవి: మనుజునికి బలమంతా
ఏమని అడిగిననాడే

లోకమున పరువంతా
ఒకరికి లొంగనినాడే ॥ఏం అన్ననాడే॥

చరణం 1: నూరేడులు దాటిన దాటుసుమా
మన ఓరిమికొక మితి లేదుసుమా

ఇకమీదటే ఈదేశప్రజ - మన
స్వేచ్ఛాదీక్షను పొగడుసుమా ॥ఏం అన్ననాడే॥

చరణం 2: ఈరోజున ఇంకిన కాలువలు
జడివానలు కురియగ వెల్లువలు
కడుచేరువలో కలదాసుఖం
అది దీనుల పాలిట పర్వదినం

చరణం 3: అభ్యుదయం చేపడులే
శ్రమపడువారలచేత
పీడితులే మేల్కొంటే
విడుదల దూరంలేదే ॥ఏం అన్ననాడే॥

---

"కథానాయకుడి కథ" లోనిదీ పాట. సంగీతం: కీ. శే. కోదండపాణి. పాడినవారు: కీ. శే. ఘంటసాల. ఈ పాట రాస్తుంటే వారు చెప్పే కొన్ని విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి. వారు చెప్పినవన్నీ నిజమని తెల్సుకోడానికి

చాలాకాలం పట్టింది. "ముందు నీ సంగతి నువ్వు చూసుకో సరోజా! నువ్వంటే నువ్వేకాదు. చెప్తున్నాను. ఉదాహరణకు చూడు, మల్లయుద్ధం చేసేవాడు ఎదుటివాడి శక్తిని తెల్సుకోడానికి వాడిచేత ముందు నాలుగు తిని తర్వాత వాడి మీద తిరగబడతాడు. ఎదుటివాడి దగ్గర కాస్త మెత్తగా కన్పించేవో, తనకి లొంగిపోయా వనుకుంటాడేకాని – నీమంచితనాన్ని అర్థం చేసుకోడు. మనదేశం పెరిగి పోవటానికి కారణం అదే! ఎదుటివాడి బలహీనతని అదును చేసుకొని బండచాకిరి చేయించుకుంటారు. అదే ఈ కష్టజీవులు ఎదురుతిరగనీ వాళ్ళ సత్తా తెలిసిపోతుంది. వీళ్లు ఎదురు తిరిగితే వాళ్ల బతుకులేమౌతాయన్న భయం వాళ్లకి లేకపోలేదు ఇంతే ప్రపంచం సరోజా!" అనేవారు.

☆ ☆ ☆

# పాపా కథ వినూ

పల్లవి: పాపా కథ వినూ
బాగా వినువిను

చిట్టిపాప కథవిను
బాగా వినువిను

అనుపల్లవి: భుజ భుజ రేకుల గొరవంక
బుజ్జా రేకుల చిలక

మనసూ మనసూ కలియంగ
జతగా హాయిగ నిలువంగ

కరిగె తుదకు కలత
వచనం ఆc కలతా ఏమిటది

ష్ పాపా కథ విను - బాగా వినువిను

చరణం 1: నాన్నా తెలుపుము ఆపై వివరము
తీయని మామిడి పండిచ్చి
మాయం అయినది చిలక

జంటను బాసిన గొరవంక
ఒంటిగా మిగిలేను తనయింట
ఒంటిగా మిగిలేను

వూరుకొండి, పాపా కథ విను

చరణం 2: మామిడిపండే వెలుగు
వెలుగును కోకిల చూచి

వెంటనె ఎగిరివాలింది
ఇల్లే కలకల్లాడే ॥పాపా॥

☆ ☆ ☆

# నాయెదలోపడి

పల్లవి: నాయెదలోపడి - నీ అడుగులసడి
పాడిన పాటలు - వినబడవూ
నీ కనువెలుగులు - కనబడవూ

అ.పల్లవి: నదియింకిన ఓడనైతిని
నడిరాతిరి నీడనైతిని
ఇంతివి పూబంతివి నిన్నే
ఎడబాసిన వాడనైతినీ ॥నాయెదలో॥

చరణం 1: మేఘం లేని ఆకాశంలో
మెరపుతీగనే వెదికాను
మినుకుమనే తారకలో - నీ
వున్నావా అని అడిగేను
జంటబాసి నేనలసీ సొలసీ
ఒంటరి శిలనై మిగిలాను ॥నాయెదలో॥

చరణం 2: కనులలో పొంగింది గోదావరి (కావేరి)
ఓదార్చలేదామరి -
నిలువెల్ల గాయమై - బ్రతుకెంతో భారమై
నినదించే మౌనమే -
అటుచూస్తే, ఇటుచూస్తే చీకటి
ఏదీ - ఇంకేదీ - చెలికౌగిలి ॥నాయెదలో॥

చరణం 3: కలిసిమెలిసి - నడయాడినయింట
కనరాదాయె - నాజంట
పండుననుకొన్న - పచ్చనిపంట
ఎండి మండించే - ఎర్రనిమంట
ఎవరితో చెప్పుకోవాలి - ఎందుకింక బతకాలి॥నాయెదలో॥

☆ ☆ ☆

# ఇదిగో వచ్చితి రతిరాజా!

పల్లవి: ఇదిగో వచ్చితి - రతిరాజా
మధువే తెచ్చితి - మహరాజా

అనుపల్లవి: అందజాలితి నీఅనురాగం
అంతులేనిదీ నాఆనందం
లలితములైన లతలవిధాన
కలిసిపోదమా - కలకాలం //ఇదిగో//

చరణం: మగువ పెదవిలో
మధుర మకరందం

చెలియకనులలో
ప్రణయతరంగం

వెల్లువలైన - ఈ సమయాన

అనుభవింపుమా - ఈ అందం //ఇదిగో//

---

"పరమానందయ్య శిష్యుల" లోనిదీ పాట. సంగీతం: కీ.శే. ఘంటసాల. పాడినది: ఎస్. జానకి.

# ఓ దేవా మొరవినవా?

పల్లవి: ఓ దేవా మొరవినవా
నామీద దయగనవా

అనుపల్లవి: అలలు పొంగే సాగరాన
తీరమే లేదా

కారు చీకటి జీవితాన
దీపమే లేదా

నేరమెరుగని దీనజనులకు
దారియే లేదా ....... ॥ఓ దేవా॥

చరణం: జానకీ పతిజంట బాసి
కాననమునందు

తిరుగులాడిన నాటిగాథ
మరచిపోయితివా

చలముమానీ - చరణమొసగి
పలుకవా దేవా!!........ ॥ఓ దేవా॥

---

రాజశ్రీ ప్రొడక్షన్స్‌వారి "శభాష్ రాముడు" చిత్రంలోనిదీ పాట. పాడినది: పి. సుశీల.

☆ ☆ ☆

# వినుము చెలీ తెలిపెదనే

పల్లవి: వినుముచెలీ తెలిపెదనే పరమరహస్యం
అది మరియెవరూ తెలియరాని - మధురరహస్యం

అనుపల్లవి: హృదయములూ - నయనములూ ఏకమాయెనే
మాఇరువురికీ భేదమింక లేకపోయెనే

చరణం: కలసిన మామనసులకే పరిణయమాయెనే
అతడె భర్తయని తలచి బ్రతికితినేనే
కన్నులలో విభునిముఖం
కదలుకాలమే
కన్నియగా - నాబ్రతుకూ - కొంతకాలమే //వినుము//

---

ఆర్. ఆర్. పిక్చర్స్‌వారి "యింటికి దీపం ఇల్లాలే" చిత్రంలోనిదీ పాట. సంగీతం: విశ్వనాథ్, రామమూర్తి. పాడినవారు: పి. సుశీల. నిర్మాత: టి. ఆర్. రామన్న. దర్శకత్వం: వి. ఎన్. రెడ్డి.

☆ ☆ ☆

# హృదయాలు మహానందాన

పల్లవి: హృదయాలు మహానందాన - తూగాడగా
సాగేనిదేలా
ఇటరమ్మని గీతికయేలా
చెలి తుమ్మెద హాయిగ పాడాలి ॥హృదయాలు॥

అనుపల్లవి: ప్రియసఖుడు - పిలిచే కనుల
కానబడే అందాల
పరుగులిడే ప్రణయాశలచే
మురియుటకే తలపాయె

ఇదికదా సరాగాల కథ
ప్రశాంతముగ మది రంజితమాయెనే ॥హృదయాలు॥

చరణం: సన్నిధినే పాడింది సుమా
కన్నులలో మధుమురళీ

గారడిగా మురిపించునుగా
ఈతొలిప్రేమల సరళీ

నన్నుజూచి తటాలున లేపి
శశాంకుని దోచులే తళతళలాడే ॥హృదయాలు॥

---

హోమీ వాడియా సమర్పించిన "జింబో నగరప్రవేశం" చిత్రంలోని దీపాట. ఈ చిత్రానికి మాటలూ పాటలు కూడ శ్రీశ్రీయే రాశారు. సంగీతం: విజయభాస్కర్. పాడినది: పి. సుశీల, దర్శకత్వం: నానాభాయ్ భట్. ఈ చిత్రం ఫిలిమ్ సెంటర్లో డబ్ చేశాం. ఫిలిమ్ సెంటర్లో "మజీద్" గారి పిక్చర్ డబ్బింగంటే శ్రీయాదగారి ఆధ్వర్యంలో పెళ్ళిలా జరిగేది. ఆర్టిస్టులూ, రైటర్స్, టెక్నీషియన్స్ అందరూ అక్కడ భోజనాలు చెయ్యాల్సిందే. ఉదయం 6 గంటలకి అందరం స్టూడియోలో ప్రవేశిస్తే - తిరిగి రావటం రాత్రి 11, 12 పైమాటకాని ఈలోగా జరిగేదికాదు. అర్థరాత్రయినా ఆ రోజుల్లో శ్రీశ్రీ డబ్బింగంటే ఆర్టిస్టులందరినీ కార్లలో దింపేవారు, కార్లలో తీసుకొచ్చేవారు. ఈనాడు ఆ పద్ధతులన్నీ పూర్తిగా పోయేయి. రానూపోనూ ఖర్చులకని వాళ్ళకి ఇంత డబ్బుని ఇచ్చేస్తారు.

# మంచికోసమని చేసిన వంచన

పల్లవి: మంచికోసమని చేసిన వంచన
నిజమై నిలిచేనుగా
మము దూరము చేసేనుగా ॥మంచి॥

అనుపల్లవి: కారడవులలో – తీరని బాధల
వారేమైనారో
కోరినకోరిక తీరకపోగా
ఆరడి పాలైతి ॥మంచి॥

చరణం: గారాబముతో పెరగవలసిన
కన్నపాపనిటుచేసితినా
కారాగారము – కారుచీకటి ॥మంచి॥

పాడినది: పి.జి. కృష్ణవేణి (జిక్కి).

☆ ☆

# పట్నం వదలాలి

పల్లవి: పట్నం వదలాలి
ఈ పట్నం వదలాలి

పల్లెకు కదలాలి
మన పల్లెకు కదలాలి

అక్కడున్నా - ఎక్కడున్నా

నీతికి నిలవాలీ

నిజాయితీగా
బతకాలీ

శుభముగ వెలగాలీ ॥పట్నం వదలాలి॥

---

శ్రీ సంజీవి మూవీస్‌వారి "నీతినిజాయితీ" చిత్రంలోనిదీ పాట. సంగీతం: యస్. రాజేశ్వరరావు. పాడినవారు: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం.

☆ ☆ ☆

# చెయ్యెత్తి జైకొట్టరా డింగరీ

పల్లవి: చెయ్యెత్తి జైకొట్టరా – డింగరీ, నీ
చేతివాటం చూపెట్టరా
ఈదునియాలో అందరూ – అహ–
మనుషులు చేసిన దొంగలు ॥చెయ్యెత్తి॥

అనుపల్లవి: నాయానికి చోటే లేదు
మోసాలకు లోటే లేదు
ఈలోకం దొంగల సంత
ఇక్కడ బలే టక్కరులంత

చరణం 1: అందరిలో మనమే మేలు
అయిదూ పది జేబులు చాలు
నమ్మించీ ద్రోహం చెయ్యం
హింసించీ ప్రాణం తియ్యం
మనదే మహామంచి వృత్తిరా అని
ఢంకా బజాయించరా ॥చెయ్యెత్తి॥

చరణం 2: పేదోళ్ల జోలికి పోకు
రాలేదే బూడిద నీకు
పోలీసుల జాడకు పోకు
బేడీలే పడతాయ్ నీకు
కంట్రాక్టరు జేబులు కొట్టు
అప్పుడే మన కడుపులు నిండు
నాయకులా జేబులు తట్టు
పలుకుతుంది పార్టీ ఫండు
వినరా ఈ దాదామాట
విజయం నీదేరా బేటా ॥చెయ్యెత్తి॥

---

పద్మావతీ పిక్చర్స్‌వారి చిత్రంలోనిదీ పాట. 17–6–1977 లో ఈ పాట రాసేరు.

# ఆరని అగ్నిజ్వాల

పల్లవి: ఆరని అగ్ని జ్వాలను నేనే!
ఆగని సంగరధాటిని నేనే!
తెలుగు వీరుడను –
క్రాంతి కారుడను –
వెలిగే ఆశా జ్యోతిని నేనే ॥ఆరని అగ్ని॥

అనుపల్లవి: తెలుగు దేశమే – పిలిచినవేళ!
కడలి కెరటమై లేస్తున్నా
తెలుగుజాతి అగచాట్లకు – పాట్లకు –
పరిష్కారమై వస్తున్నా! అన్నకి
అండనై – అమృత భాండమే తెస్తున్నా ॥ఆరని అగ్ని॥

చరణం: సోమరిపోతులు సుఖపడుతూంటే!
కష్టజీవులకు కన్నీళ్ళే – కుళ్ళిన
వ్యవస్థ మారేదాకా దీనుల
అవస్థ తీరేదాకా!! మెరుపునై
ఉరుమునై పిడుగుల
జడులే కురిపిస్తా!! ॥ఆరని అగ్ని॥

---

జె. వి. కె. కంబైన్స్ వారి "అగ్నిజ్వాల" చిత్రం లోనిదీ పాట. సంగీతం: కే. శే. సత్యం. పాడినవారు యస్. పి. బాలసుబ్రహ్మణ్యం. 15-12-1983వ తేదీన జెమినీలో ఈ పాట రికార్డింగ్ జరిగింది.

# విప్లవం చూస్తున్నారు

చూస్తున్నారు - చూసి
లేస్తున్నారు - లేచి
వస్తున్నారు - వచ్చి
తెస్తున్నారు - విప్లవం
కాస్తున్నారు - కొమ్ము
దూస్తున్నారు - అమ్ము
వేస్తున్నారు - వచ్చి
తెస్తున్నారు - విప్లవం -
పోస్తున్నారు - ఝంప
నేస్తున్నారు - శంప
వస్తున్నారు - వచ్చి
తెస్తున్నారు - విప్లవం
ఇస్తున్నారు - ప్రాణం
చేస్తున్నారు - గానం
వస్తున్నారు - వచ్చి
తెస్తున్నారు - విప్లవం
అరుస్తున్నారు - కవులు
మెరుస్తున్నారు - రవులు
చాటిస్తున్నారు - శపథం
సాగిస్తున్నారు - సమరం
వస్తున్నారు - వచ్చి
చూస్తున్నారు - చూసి
లేస్తున్నారు - లేచి
తెస్తున్నారు - విప్లవం

---

శ్రీశ్రీ "విప్లవగేయం"

☆ ☆ ☆

# అణగారిన బతుకులలో

అణగారిన బతుకులలో
ఆశాజ్యోతులు వెలిగించీ
మానవత్వమే మతమనిచాటిన
మహాత్ముడే మనదైవం!
మహాత్ముడే కలలుగన్న మరోప్రపంచం
మెరిసిందీ, పిలిచిందీ, మరోప్రపంచం – గాంధీ
మహాత్ముడే కలలుకన్న – మరోప్రపంచం

ఈదేశం నీదీ నాదని – ఇది
ఒక్కరికే సొంతం కాదని –
గంగా, కావేరీ – నదులు కలుపుతాం
కలిపి, సరిహద్దు చెరిపి – చెలిమి నిలుపుతాం!
మన నేతాజీ ఆశించిన మరోప్రపంచం –
మెరిసిందీ – పిలిచిందీ

ఒకే గూటి గువ్వలం – ఒకే తీగె పువ్వులం
తర తరాల చీకట్లను – తొలగించే దివ్వెలం
మన నెహ్రూజీ ఆశయం మరో ప్రపంచం –
మెరిసిందీ – పిలిచిందీ

అహం మీరి జులుంచేయుద్రోహుల –
బలం చూపి హతమార్చే వీరులం –
హలంబూని, పొలందున్ని, మట్టిలో
మేలిమి బంగారం పండించే రైతులం

---

"మరోప్రపంచం" చిత్రంలోనిదీ పాట. సంగీతం: కె. వి. మహదేవన్ – పాడినవారు ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, ఎస్. జానకి మరియు బృందం. తనకు కావలసిన విధంగా – అంటే తను చెప్పదల్చుకున్న దాన్ని రాసేటందుకు

అవకాశం కలిగేటప్పుడు ఎంత సంతోషంగా వుండేవారో చెప్పతరంకాదు. ముసిముసి నవ్వులతో యింటికి వచ్చినపుడే నాకు అర్థం అయిపోయేది – తను అనుకొన్నది సాధించి వుంటారని – ఇటువంటి పాటలు రాసేటప్పుడు – జాగరణే చేసేవాళ్ళం – వారొక్కరు మేలుకొంటే జాలి వేసేది. పాటయితే అరగంటకే ఎడంచేత్తో రాసి పారేసేవారు. ఇలా కాదు – అలాగ అని, కాదు – ఇలాగని ఎన్ని వెరైటీలూ రాసేవారో – అవన్నీ భద్రపరచినందువల్లా – ఒకదాని కొకటి తీసిపోని విధంగా ఉండటం వల్ల పల్లవిని మాత్రం టికిన్స్ చేసుకొని ఆ వెరైటీ సాంగ్స్‌ని కూడ ఒక్కొక్క పుస్తకంలో రాస్తున్నాను.

☆ ☆ ☆

# మెల్ల మెల్లగా వస్తోంది

మెల్ల మెల్లగా వస్తోంది!
చిట్టి పొట్టి అడుగుల
చీమ నడకలు సాగిస్తూ
వస్తోంది నింపాదిగా!

విత్తనంలోంచి ఎదుగుతున్న వృక్షం లాగ
సావధానంగా పరిపక్వ మవుతూ
గర్భంలో పెరుగుతున్న పిండం లాగ
నిశ్చయంగా వస్తోంది

చీకట్ల గందర గోళం నుంచి
నిరాఘాటంగా – వేగుజుక్క లాగ
ఇంతలోనే వేగం పుంజుకొని
జోరు జోరుగా వస్తోంది

తుఫానులో సముద్రతరంగాల్లాగ లేస్తూ
ఒక దేశం నుంచి – మరొక దేశం దాకా
పెద్ద పెద్ద అంగలు వేస్తూ
ఒక జీవితాన్ని మరొక జీవితానికి పెనవేస్తూ
నా గొంతుకలో ఉప్పొంగుతున్న – విప్లవం –
వస్తోంది – వస్తోంది!

19–11–1977లో శ్రీ శ్రీ రాసిన విప్లవ గేయం

☆ ☆ ☆

# దేశంలో కొన్ని నక్కలున్నాయి

దేశంలో కొన్ని నక్కలున్నాయి అవి
మోసాలు చేసి చిక్కకున్నాయి –
మరచిపోకుమోయి నా
మాట వినర భాయి. ॥ఈ॥

మేకవన్నె పులివేషాలు చూసి
చీకటి నక్కల జిత్తులు తోసి
తొందరగా నీ ముందర దారి,
చూస్కో – కాస్కో – భాయీ.
తెల్లని దుస్తులు వేసి వేసి –

మనదేశము నాశనము చేసి చేసి
దగాకోరులై తిరుగుతారు సై
నల్లని మనసు చెల్లని దినుసు
అల్లరి మనుషులండి మంది

భక్తి కొంగలు – పచ్చి దొంగలు
ఎవరికి లొంగరు గట్టివారు
పైకి పటారపు – మొనగాళ్ళు!
లోన లొటారపు గిజిగాళ్ళూ

బోర విరుచుకొని – నోరు తెరచుకొని
పదవి పంచుకొని – ప్రజల నంచుకొని
ఊరూరా – చోరీలు – ఖూనీలు చేస్తారు

గూడుపురాణీ – చేస్తారు
మనుషుల్లోనే ఉన్నారు – మొగం దాచుకొని తిరిగేరు –
చీడ పురుగులాంటి రాచ కురుపులాంటి

పీడ పట్టుకుంది వీళ్ళ వల
కురుపు మాడకుండా –
పురుగు చావకుండా –
ఊరు చల్లబడడ ముతకల

అన్నతమ్ముల పొత్తు చూసి
ఆ యిద్దరినీ వేరు చేసి
ఆడే దుండ గీళ్ళు
హద్దే లేని వాళ్ళు
విరిచి వాళ్ళ కాళ్ళు
నొక్కి వీళ్ళ నోళ్ళు
కనిపెట్టు ఒక్క కంట
పగ బట్టు చివరకంట
గెలుపు నీదే

ఆరిన దీపము మరల వెలగదు – చ
ల్లారిన కోపము, తిరిగి రగలదు అందుకనే
కనిపెట్టు వీళ్ళని ఒక కంట –
పగ పట్టి వదలకు చివరంట
గెలుపునీదే!

☆ ☆ ☆

# చీకటి విచ్చునిక

పల్లవి: చీకటి విచ్చునులే - వెన్నెల వచ్చునులే!
ఎపుడో ఒకసారి ఏదో ఒక దారి,
దొరుకునులే బాటసారి ॥చీకటి॥

అనుపల్లవి: అయినవాళ్ళు లేరని - దిగులు చెందకోయీ
ఉన్నవాళ్ళు నా వాళ్ళనే - అనుకోవలె నోయీ!
స్వేచ్ఛగా దిక్కు లేని - పక్షులు విహరించవా
హాయిగా నోరులేని పశువులు జీవించవా
భయమెందుకు - పదముందుకు
ఓయీ బాటసారీ ॥చీకటి॥

చరణం: ఆశతోటి లోకమంత - బతుకుతుందిరా!
అందులోనే కథ అంతా - ఇమిడి ఉందిరా!
కష్టానికి సౌఖ్యానికి లంకె వుందిరా!
ఈ కాలచక్రము ఆపగ - ఎవరి తరమురా!
భయమెందుకు - పద ముందుకు
ఓయీ బాటసారీ ॥చీకటి॥

"పొట్టి ప్లీడరు" చిత్రంలోనిదీ పాట. సంగీత దర్శకత్వం: కే. శే. కోదండపాణి - పాడినవారు: కే. శే. ఘంటసాల.

☆ ☆ ☆

# హోయీ - మొదటి రేయి!!

పల్లవి: హోయీ - మొదటి రేయీ!
స్నేహ దాహం - వెన్నెలా!
చంద్రలోకం చేరానే!
జంటకోరి నీతో నే ॥హోయీ॥

అనుపల్లవి: మందార వనిలో
శృంగార నిధిలో -
పూవై రాణించవా ॥హోయీ॥

1వ చరణం: నిరుపేద యెదలో!
కురిపించి గానం!
చెలియను లాలించవా!
డెందంలోనే - చిందులు వేసే!
అందం చూడాలి!
ఆరాధిస్తూ - కోరే గీతి!
ఆలాపించాలి! ॥హోయీ॥

2వ చరణం: మృదువైన గాలి!
మనమీద తేలి!
కొసరును శ్రీరాగమే!

అతడు: మనసైన బాలా!
మధుమాసవేళా!
గురిచేయు పూబాణమే!

ఆమె: మనసూ మనసూ - నేనూనీవై స్వర్గం చేరాలి

అతడు: భాగ్యం పండి, ఈలోకాన - రాజ్యాలేలాలి ॥హోయీ॥

---

"చంద్రలోకం" చిత్రంలోనిదీ పాట. పాడినవారు పి. సుశీల, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం.

☆ ☆ ☆

# ఓ దేవదేవరా-దయాసాగరా

పల్లవి: ఓ దేవదేవరా! ఓ దయాసాగరా!
చిత్తగించాలి – నా చిన్నమాట!

అనుపల్లవి: విద్యలార్జించి – నిరుద్యోగి నయినాను!
గూడులేదిసుమంత – కూడులేదు!
గుడిలోన దొరకదా పిడికెడు నైవేద్య
మని యిటు వచ్చినా నలసి సొలసి ॥ఓ దేవ॥

1వ చరణం: ఆశలన్నీ అడియాసలుగా మారి!
స్పష్టమై పోయె వాస్తవము నాకు!
కటిక పేదల దైవము కావు నీవు!
ధనముగల వారికే ఇట సొంత మయినావు!
మాసె నీమీది కాస్త – నమ్మకముకూడ!
విసుగుపుట్టింది – తుదకు జీవితముమీద ॥ఓ దేవ॥

2వ చరణం: వినుము నేపొందిన అనుభవములు!
విద్యలార్జించి నిరుద్యోగి నయినాను!
గూడులేదు రవంత కూడులేదు!
చిన్న నౌకరు పనికెన్నో సిఫార్సులు!
దాని పక్కనే కులతత్వ హింస!
మామూళ్ళు లేకున్న మాట్లాడనే – ఆడ
రయ్యయ్యో – కార్యాలయముల యములు!

3వ చరణం: కటిక చీకటి బతుకులో కాంతి శాంతి!
తుదకు నీ గుడిలో కూడ దొరకలేదు!
కావు పేదల దైవము కావు నీవు!
తండ్రి – నీ దారి నీది–నా దారి నాది ॥ఓ దేవ॥

# జనస్వామ్య వీరుడికో సలహా

ముష్టి మైదానంలో
సవ్యసాచివిరా కొడకా
నాలుగు గోడల మధ్య
రహస్యంగా ఏవిటా పని
నాలుగు వీధుల
కూడలి వద్ద –
బహిరంగంగా నిలబడి!
నిరూపించుకో – నీ మగతనం!
ఆంధ్రుల జాతీయ పత్రికా
సంపాదకీయాలకు!
ఆదర్శప్రాయంగా ప్రదర్శించుకో!
నీ వ్యక్తి స్వాతంత్ర్యం!!

☆ ☆

# ఓ శ్రామిక వీరాగ్రేసరులారా!

సాకి: ఓ శ్రామిక వీరాగ్రేసరులారా!
సంగ్రామాంగణ కేసరులారా!
పురోగమించే కార్మికులారా!
పరాక్రమించే సైనికులారా!
ఆగదు - ఆగదు - ఆగదు మన సమ్మె!

పల్లవి: పోరాటమే బాటగా!
లెండి - లెండి - లే లెండిరా!
సమ్మె హక్కు - నొక్కి బాటగా!
రండి - రండి - రారండిరా!
విప్లవం వర్ధిల్లాలి - విప్లవం వర్ధిల్లాలి!

అనుపల్లవి: హెచ్చించే కూలిడబ్బు
ఒకటి రెండు రూకలా
॥అయ్యాయ్యో॥
ఆ వెంటనె ధరలు పెరుగు!
హనుమంతుని తోకలా!
యింటికెళితే ఆలుబిడ్డలంతా పస్తు!
ఈ బతుకు యధాప్రకార సిద్ధిరస్తు ॥ఓ శ్రామిక॥

1వ చరణం: రూకల బాబులే ఆకలి ప్రేగుల
నటకాయిస్తారా?
అలాగనయితే - ఆ బాబుల గతి!
గుటకాయ స్వాహా!!
విప్లవం వర్ధిల్లాలి - విప్లవం వర్ధిల్లాలి!

2వ చరణం ధనవంతులు బలవంతులు!
మనధాటికి నిలువలేరు!
ఏకమైన మన కార్మిక శక్తికి!
ఈ లోకంలో ఎదురే లేదు!
ఏనాడూ అపజయమే రాదు!
ఇంక్విలాబ్ జిందాబాద్! ఇంక్విలాబ్ జిందాబాద్!

# కదిలిందీ - కార్మికవర్గం

సా: కదిలిందీ – కార్మిక వర్గం!
పగిలిందీ భూస్వామ్య దుర్గం!

పల్లవి: కదిలిందీ – కదిలింది కార్మిక వర్గం!
పగిలిందీ – పగిలింది భూస్వామ్య దుర్గం!
ఒకే మాటగా – ఒకే బాటగా
పదండి రండి – జన్మ హక్కు చాటగా!

అనుపల్లవి: సాగుతున్న జైత్రయాత్ర – ఆగదు మరి ఆగదు!
రాజుకున్న విప్లవాగ్ని – ఆరదు చల్లారదు!
ఇంక్విలాబ్ జిందాబాద్!
కార్మిక భారత్ – వర్ధిల్లాలి

1వ చరణం: రాబందు రాజ్యానికి – కూల్చండీ పునాదులు!
కామందుల చట్టానికి – కట్టండీ సమాధులు ॥కదిలిందీ॥

2వ చరణం: రైతుకూలి స్నేహానికి!
కలిపి సుత్తి కొడవలి!
రాబోయే వ్యవస్థకై
ఎత్తు ఎర్ర పిడికిలి
ఇంక్విలాబ్ ... జిందాబాద్!
కార్మిక సమరం – వర్ధిల్లాలి!
మనం కన్న చిరకాలపు!
కలలన్నీ ఫలించగా!
మన కథలే చరిత్రగా!
నడవండీ ప్రతిజ్ఞగా! ॥కదిలిందీ॥

---

శ్రీ సూర్యచంద్ర పిక్చర్స్ వారి "రఘుపతిరాఘవరాజారామ్" చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# ఓహో రక్కసి గోరుల

పల్లవి: ఓహో! రక్కసి గోరుల రాబందూ!
ఓరీ! నక్క జిత్తుల కామందూ!
సవాలు చేస్తాను నీకో సమాధి కడతాను!

అనుపల్లవి: వెచ్చని నెత్తురు నాది!
చచ్చిన సత్తువ నీది!
నా కోపం మండిందంటే!
నీ పాపం – పండిందంటే!
రవినై వెలిగి! జనమై పెరిగి!
శివతాండవమే చేస్తాను! ॥రక్కసి గోరుల॥

1వ చరణం: మోసాలెన్నో చేశావు!
నిర్దోషుల గొంతులు కోశావు!
పదవికి నిచ్చెన వేశావు!
నువు పాము నోటిలో పడ్డావు!
పలకదు మంత్రం! పారదు తంత్రం!
ఇక సాగదు నీ – దుస్తంత్రం ॥రక్కసి గోరుల॥

2వ చరణం: భగ భగ, ధగ ధగ –
పెనుమంటలుగా
ప్రజాస్వామ్యమే రేగిందీ
గణ గణ – ఝణ ఝణ –
గుడిగంటలుగా!
ప్రగతి గీతమే – మ్రోగింది
అన్యాయాలకు – ఆటకట్టుగా!
అధర్మాలనే – అదరగొట్టగా!
న్యాయం నిలిచిందీ ధర్మం గెలిచిందీ!
సత్యం పలికిందీ! ॥రక్కసి గోరుల॥

---

శ్రీ వాసవీ ప్రొడక్షన్ వారి చిత్రంలోనిదీ పాట. సంగీతం : జె.వి.ఆర్. విజయా గార్డెన్స్‌లో 3–5–79లో రికార్డింగ్ అయింది.

# ఊరంతా సంక్రాంతి

పల్లవి: ఊరంతా సంక్రాంతి - పూచింది చేమంతి!
కలువల కన్నెల - కన్నుల కాంతి!
మెరిసేను విరిసేను శాంతి!
ఆనందమానందమాయె!
ఆడండి పాడండి నేడే ॥ఊరంతా॥

అనుపల్లవి: చలాకీ పిల్లలంతా - సయ్యాటలాడండి
ఇలాగే పల్లెనంతా - ఉయ్యాల లూపండి!
అందాల బాట సాగండి - మకరందాల తేటల తేలండి

1వ చరణం: మన బంగారు మాగాణి పండిందిలే!
పరమానందమే యెద నిండిందిలే ॥హోయ్॥

2వ చరణం: విలాసం పొంగు లెత్తీ - ఆకాశమంటేను!
వినోదం పూలు పూసీ - వెన్నెల్లు కాసేను
చిన్నల్లారా చిరుతల్లారా!
మనసులు తెలిసీ - చనువుగ కలిసీ!
జంటగ - జట్టుగ కదలండీ ॥ఊరంతా॥

3వ చరణం: వినండీ వీనులారా - సంక్రాంతి సంగీతం!
కనండీ వింతలన్నీ - ఆబాల గోపాలం!
ముత్యాల ముగ్గుల సంక్రాంతి!
ప్రమోదాల నిగ్గుల పూబంతి!
మన ఊరంతా కొండంత ఉల్లాసమే!
కడు సంతోషమే - శుభ సందేశమే ॥హోయ్॥

అదో మా కామధేనువు - క్షీరాలు చిలికిందీ
ఇదో మా ప్రేమ వేణువు - శ్రీరాగ మొలికిందీ
మురిపెములొలికే - ముద్దులుకులికే
చిట్టీ పొట్టీ చిలకల్లారా
చేరువ చేరగ - రారండీ ॥ఊరంతా॥

---

కోటగిరి ఫిలిమ్స్ వారి చిత్రంలోనిదీ పాట.

# ఈ సభలో - ఈ భువిలో

పల్లవి: ఈ సభలో, ఈ భువిలో!
విజ్ఞులు - తజ్ఞులు, ప్రాజ్ఞులు -
లేరా ఎవరూ లేరా?

అనుపల్లవి: లేరా? ఎవరూ లేరా?
ధర్మ రక్షకులు లేనే లేరా?
కర్మ వీరులే కరువైనారా?
నిదురించేరా శిలలైనారా?

1వ చరణం: శౌర్య, ధైర్య సాహసాది శక్తిమంతులే
న్యాయనిధులు - వేదవిదులు - ఖ్యాతిమంతులే!
ద్యూత భవనమే ఒక నీతి సదనమై!
ఈ నాతిని అవినీతికి బలిచేస్తారా?

2వ చరణం: పంచవహ్ని శిఖలు దీప్తి భగ్నమాయెనే
వంచకములె మృగరాజుల - పరిహసించెనే
దుష్టవలయమే - పగబట్టి నిలిచెనే
సతి దుర్గతి నెదురించని, క్షాత్రమెందుకు?॥ఈ సభలో॥

మాధవీ పద్మాలయా కంబైన్స్ వారి చిత్రంలోనిదీ పాట.

☆ ☆

# ధర్మసంస్థాపనదీక్షా

పల్లవి: ధర్మ సంస్థాపనదీక్షాకంకణ భూషితులారా!
దశ, దిశాంత, విశ్రాంత, ధవళ, యశోవిభాసితులారా!
వీర తిలకములు ధరించి - సమరం సాగించండీ!
వీర ఖడ్గములు వహించి - విజయం సాధించండీ!

అనుపల్లవి: సదమల శౌర్య పరాక్రమ - విశ్రుత సాహస కేసరులారా
కదనకుతూహల-కోలాహల - యోధాగ్రేసరులారా
పటీర నీరాజనమిది కామ్య సిద్ధిరస్తు!
పరిమళ భరిత - సుమాంజలి యిది
జయోస్తు - విజయోస్తు - దిగ్విజయోస్తు.

1వ చరణం: ధర్మక్షేత్రం - ఇది కురుక్షేత్రం
కురుపాండవ రోషాగ్నుల - రణక్షేత్రం
రథ-గజ - హయ-పదాతి - దళ సరభసగమనం!
ప్రళయ - ఝనా ఝన - భీషణ, భాంకృతి నినదా!

2వ చరణం: సితాశ్వ హనుమద్ధ్వజానురంజిత -
రథస్థితులు కృష్ణార్జునులు -
విజయుడు రథి గోవిందుడు సారథి -
ఉభయులు నర నారాయణులు!

3వ చరణం: గ్రీష్మాదిత్యుడు భీష్మాచార్యుడు!
తాళ పతాక స్ఫాలితుడు -
రంగత్తుంగ మదేభ నిభాంగుడు!
రారాజే దుర్యోధనుడు!

4వ చరణం: మంచి చెడ్డలకు నడుమ – నిరంతర ఘర్షణసాగే!
మానవ జీవితమే ఒక మహాభారతాఖ్యానం!
నరులుండే ఇల సకలం కురుక్షేత్రమే! ఇట
జరుగుతుంది అనుక్షణం ధర్మయుద్ధమే.

5వ చరణం: అర్ణోరాశి గభీరుడు కర్ణుడు –
అమలిన కర్ముడు ధర్మజుడు –
ధనురాగమ నిష్ణాతుడు ద్రోణుడు!
శపథక్రోధి – వృకోదరుడు
కనత్కనక నగతుల్యుడు శల్యుడు!
ధృష్టద్యుమ్నుడు – దుస్సహుడు
శకుని మామ మాయావనసీమ – సు
భద్రాసూనుడరిందముడు!
బాహుబలో దగ్రులు!
బడబాగ్ని శిఖా విస్ఫీతులు!
మోహరించి రాహవమున!
తనయులు, తండ్రులు, తాతలు!
అనివార్యం యుద్ధం –
శర సంధానమె ధర్మం! ఆ
ధర్మ పరీక్షాంగణమే!
కురుక్షేత్రం!!

---

మాధవీ పద్మాలయా వారి చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# జగమంతా ఒక సరకస్సు

పల్లవి: జగమంతా ఒక సరకస్సు
జనులందరికీ శుభమస్తు
ఇవాళ రండి రేపు రండి
ఇలాగె రోజూ వస్తూండండి
కన్నుల విందులు కలిగించే ఈ
పందిరి కిందికి అందరు రండి //ఇవాళరండి//

అనుపల్లవి: తెలివితేటలు కలిగిన మనుషులు
దేవుడి మాటే వినక
దేవుడినైనా కనక
స్వలాభాలకై కలహిస్తూంటే
నోరూవాయీ లేని మృగాలు
మనిషి చెప్పింది విని – మనిషి పెట్టింది తిని
సహజీవనమే సాగించే – ఈ
చక్కని దృశ్యం చూడాలంటే //ఇవాళరండి//

చరణం: బతుకే గిర గిర తిరిగే వలయం
ఒకరిని పెంచేస్తుంది
ఒకరిని దించేస్తుంది –
కలిమీ లేముల క్రీడా నిలయం
ఒకరిని కులికిస్తుంది
ఒకరిని జడిపిస్తుంది! ఇది
కోటి విద్యలూ కూటి కోసమని
చాటే పండితపరిషత్తండి – //ఇవాళరండి//

---

ఇది పద్మాలయా వారి చిత్రం లోనిది. 27–2–76న విజయా గార్డెన్స్‌లో రికార్డింగ్ అయింది.

☆ ☆ ☆

# మనసైన మరదలినీ

మనసైన మరదలినీ –
మచ్చికైన గడసరినీ –
సిననాటి సెలికాడు
సేరువయే దీనాడు //మనసైన//

దట్టమైన అడవిలోన
దాగివుంటే సూడలేన
సందుసూసి ముందుగానే
జాడ తెలిసి రాలేనా
నాగమల్లి పూలతోట
తీగసాగు పాలబాట
ఎదురువచ్చు బావయ్యని
బెదరొద్దని – సెప్పలేన
సందెవేళ – సల్లగాలి
జల్లుమంది పేదగుండె
కనపడనీ బావకోసం
కలలుకనీ పలవరించే
మనసైన మరదలినీ
వయసైన గడసరినీ
సిననాటి సెలికాడు
సేరువయే దేనాడు //నానీనా – నానీనా//

---

ఈ పాట కళాకేంద్రం వారి "దాహం దాహం" చిత్రంలోది. పాడినవారు – పి. సుశీల.

☆ ☆ ☆

# వీర భారతీయ పౌరులారా!

పల్లవి: వీరభారతీయ పౌరులారా
దేశమాత పిలుపు వినలేరా

అనుపల్లవి: హిమాలయంలో మంటలు రేగి
ప్రమాద సమయం వచ్చింది
స్వతంత్ర భారత యోధుల్లారా
సవాలెదుర్కొని కదలండీ ॥వీర భారతీయ॥

1వ చరణం: అంతా స్నేహితులనుకున్నాము
అందరి మేలూ ఆశించేము
పరుల మంచిపై నమ్మకముంచి
పగటి కలల్లో జీవించాము
నేటికి కలిగెను కనువిప్పు
ముంచుకు వచ్చెను పెనుముప్పు ॥వీర భారతీయ॥

2వ చరణం: వీర మాతలారా! సుతులకు
చందనగంధం పూయండి
వీర వనితలారా – పతులకు
కుంకుమ తిలకం తీర్చండి
నెత్తురు పొంగే యువకుల్లారా
కత్తులు దూసి దూకండి
బానిసతనమున బతికే కన్నా
చావే మేలని తలచండి ॥వీర భారతీయ॥

3వ చరణం: మనమంతా ఒకే జాతి
సమైక్యమే మన నీతి
కులమేదైనా మతమేదైనా

వేషం భాష వేరే అయినా
జనమొకటేనని చాటండి
ధర్మదీక్షయే మనకవచం
తప్పక మనదే ఘన విజయం
భరత మాత పరువునిల్పగా
భరత వీర ప్రతిన దాల్చరా
జయపతాక చేత బూనరా
సమర విజయ శంఖమూదరా //వీర భారతీయ//

---

"జై జవాన్" చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# కళ్ళలో పెళ్ళిపందిరి

పల్లవి-అతడు: కళ్ళలో పెళ్ళిపందిరి - కనపడసాగే
పల్లకీ లోన ఊరేగే - ముహూర్తం
మదిలో కదలాడే -
ఆమె: కళ్ళలో పెళ్ళిపందిరి - కనపడసాగే
పల్లకీ లోన ఊరేగే - ముహూర్తం
మదిలో కదలాడే

అతడు: నుదుట కళ్యాణ తిలకముతో
పసుపు పారాణి పదములతో
పెదవిపై మెదిలే నగవులతో
వధువు నను ఓరగ చూస్తూంటే
జీవితాన ..... పూలవాన //కళ్ళలో పెళ్ళిపందిరి//

ఆమె: సన్నాయి చల్లగా మ్రోగి -
పన్నీటి జల్లులే రేగి -
మనసైన వరుడు - దరిచేరి -
మెడలోన తాళి కడుతూంటే
జీవితాన .... పూలవాన //కళ్ళలో పెళ్ళిపందిరి//

అతడు: వలపు హృదయాలు పులకించి
ఆమె: మధుర స్వప్నాలు ఫలియించి
అతడు: లోకమే వెన్నెల వెలుగైతే
ఆమె: భావియే నందన వనమైతే
అతడు: జీవితాన -
ఆమె: పూలవాన //కళ్ళలో పెళ్ళిపందిరి//

---

ఈ పాట "ఆత్మీయులు" చిత్రంలోనిది. సంగీతం: ఎస్. రాజేశ్వరరావు - పాడినవారు - కీ. శే. ఘంటసాల, పి. సుశీల.

☆ ☆ ☆

# ఏ దారి దొరకని ఈ చీకటిలో

సాః ఏ దారి దొరకని ఈ చీకటిలో
వెలుగు రవ్వ లేదా? ఈ
రేయి ముగిసి పోదా?

పల్లవి: వెలుగు రవ్వ లేదా? ఈ
రేయి ముగిసి పోదా?
మారదా మారదా – మన
బతుకులగాథ తీరదా – నిరుపేదల బాధ //వెలుగు//

అనుపల్లవి: చింకిపాత కరువైన – జీవితాలురా బాబూ
కాటికి పంపాలన్నా – కప్పక తప్పదు గలీబు
మనచేతుల నేతలఫలం
మనకందని ఈ లోకంలో //వెలుగు రవ్వ//

1వ చరణం: నివురుగప్పినా గానీ – నిదుర పోదురా నిప్పు
అదును చూసి రగులుతుంది అదే నీకు కనువిప్పు
చలిమంటలు మేలుకొలుపు
వినిపించని లోకంలో //వెలుగు రవ్వ//

2వ చరణం: కొలిమిలోన యినుప కమ్మి,
తిని తిని – సమ్మెట దెబ్బలు
నిలువెత్తున నిలిచి – తుదకు
చరుస్తుంది తన జబ్బలు
పగబట్టిన చెమట బొట్లు
భగ భగ మండే దాకా //వెలుగు రవ్వ//

---

బాలాజీ ఆర్ట్ పిక్చర్స్ వారి "కోయిలమ్మ కూసింది" చిత్రంలోనిదీ పాట.
సంగీతం: పెండ్యాల.

☆

# ఓహో - ఆఘమేఘాల

పల్లవి: ఓహో - ఆఘ మేఘాల మీద
ఆహా - స్నేహమే వెలుగుబాట
మెరపు తీగలా ఏకధాటిగా
మును ముందుకు సాగి పోరా ॥ఓహో॥

అనుపల్లవి: బుస బుస పొంగే - యవ్వనముంది
జబ్బల కండల - నిబ్బర ముంది
చెదరని చెరగని - బంధం వుంది
సత్యం ధర్మం సాహస ముంది ॥ఓహో॥

1వ చరణం: ఆరవు గాలికి మన దీపాలు
ఆగవు ఆజ్ఞకు మన వేగాలు
పడుచు తలపులకు గొళ్ళెం లేదు
ఉడుకు గుండెలకు - కళ్ళెం లేదు ॥ఓహో॥

2వ చరణం: వాడిగ వేడిగ వయసే వున్నా
బరువూ బాధ్యత గుర్తించాలి
గమనం చాలదు - గమ్యం ముఖ్యం
కాగల కార్యం - సాధించాలి. ॥ఓహో॥

# గెంతి పడే నాహృదయం

పల్లవి: గెంతి పడే నా హృదయం
పంతమేలా లైలా
భ్రాంతి యేలా - సిగ్గేలేదా
దర్పమే నీకేలా? ॥...గెంతి పడే ॥

అనుపల్లవి: అరె వాదమేలా లైలా
చాలించరాదా గోలా
పట్టబోకు పాదం -
నీకు పట్టిందా పిచ్చి
పోదునన్నా పోను - నిన్నే మదినేమెచ్చి ॥గెంతి పడే॥

1వ చరణం: మనసులోన లేని కోణంగి పల్కుచాలు
దారికి వస్తావు చూదాములే మజాలు
గుండె ఆగిపోతుందే చూపకు కోపాలు - మరి
త్రోసివేయరాదు - ఈ పేదమనిషి అర్జీ

2వ చరణం చుట్టితినే పాగా - ఒక పాశమిదే చూసి
పట్టముకడతానే వేధించకునన్ను కోసి
ఇన్ని కోతిపనులేలా చాలునులే మౌళి ఇక
మానుము నీ మాట - అది నీటిలోన మూట.

3వ చరణం: చూడవుగా సత్యం లేకున్నవిగా ఊహాలే
పైసలా చెయ్యాలే - ఇదేదో చూడనే
నీ దోవనే పో నీవు మన్నించను నీ అర్జీ
మనమిద్దరమూ ఒకటై పోదాము.

---

హోమీవాడియా సమర్పించు "జింబో నగర ప్రవేశం" చిత్రంలోనిదీ పాట.
మాటలు - పాటలు - కే. శే. శ్రీశ్రీ; సంగీతం - విజయభాస్కర్;

పాడింది: పి. బి. శ్రీనివాస్ మరియు జమునారాణి. ఫిలిమ్‌సెంటర్ వారి డబ్బింగంటే – ఆ రోజు కాల్‌షీట్ పూర్తయ్యే సరికి – అడుగుతీసి అడుగు పెట్టడానికి కూడ ఓపిక లేనంత నీరసం ఒచ్చేసేది – అందుకని – ఆర్టిస్టులూ వర్కర్లతో సహా – ఎవరికీ బోరుకొట్టకుండా వుండేందుకు – మధ్య మధ్యలో పాటలు – వేరే పిక్చర్ల రీల్సు వేసి మాకు రెస్ట్ ఇచ్చేవారు – ఫిలిమ్ సెంటర్ డబ్బింగంటే – ఆర్టిస్టులంతా పోటాపోటీలుగా ఎగబడేవారు.

☆ ☆ ☆

# పగలు రేయిలో జారకముందే

పల్లవి: పగలు రేయిలో జారక ముందే
వెలుగు చీకటిగ మారక ముందే
కలుసుకుంటాం - ప్రతీ సాయంత్రం
ఈ నిముషాలే మా సొంతం
ఈ అనుభవమే ఆనందం //కలుసుకొంటాం//

అనుపల్లవి: ఆశయాలు మా కెన్నో ఉన్నవి
అవి ఆకాశంలో విహరిస్తున్నవి
దిగి రాలేక అణిగీ మణిగీ
దిగులు దిగులుగా నిదురిస్తున్నవి
అందుకే
ఏం చెయ్యాలో ఏమీ తోచక
ఎటు పోవాలో అసలే తెలియక //కలుసుకొంటాం//

1వ చరణం: నిరాశ నిండిన ఈ కలికాలం
అశాంతి మండిన ఆ కలికాలం - ఆకలి కాలం
నిరుద్యోగమే వండిస్తూ ఉంటే
ప్రతిభను కానక ఖండిస్తూ ఉంటే
ఇన్నాళ్ళూ
ఊరడింపులే దూరం కాగా
ఒకచో చేరిన కాకుల్లాగా //కలుసుకుంటాం//

2వ చరణం: చిటారు కొమ్మని - మిఠాయి పొట్లం
దొరికి తీరునని - కలలే కంటూ
కఠోర జీవిత - దురంత దుఃఖం
కరిగి పోవునని - కథలే వింటూ

ఇలాగే

*ఒకరి బాధలే ఒకరికి తెలుపగ*
*ఒకరికి ఒకరూ తోడై నిలువగ* //కలుసుకుంటాం//

---

గోదావరి చిత్ర వారి "మంచుపల్లకి" లోనిదీ పాట. సంగీతం - రాజన్ - నాగేంద్ర - పాడినవారు - ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం - 13-2-82 తేదీన ఈ పాట జెమినీ స్టూడియోలో రికార్డింగ్ అయింది.

☆ ☆ ☆

# ఆడలేక ఆడెదనే

పల్లవి: ఆడలేక ఆడెదనే -
పాడలేక పాడెదనే
దైవాన్నే వేడెదనే
రా రారా రా - దేవా
దేవ రా - దేవ రా ॥ఆడలేక॥

అనుపల్లవి: విధియే తన చేయిచాచి
వల వేసేనే -
ఊరంత వగకొనగ -
వెల పోసేనే
అందాన్నే బేరమాడ
ప్రజ కూడేలే
నా బాధ వినువారె
లేరెవ్వరూ - లేరెవ్వరూ ॥ఆడలేక॥

చరణం: కోయిలనె గొంతునొక్కి - పాడమందురే
మయూరినే కాల్విరిచి, ఆడమందురే
కన్నెపిల్ల కన్నీటికి పారమున్నదా
రగిలే నా యెదనార్ప - రారెవ్వరూ - రారెవ్వరూ
॥దైవాన్నే॥

నందగారీ ఫిలిమ్స్ వారి "కథానాయకుడి కథ" చిత్రంలోనిదీ పాట. సంగీతం - కీ. శే. కోదండపాణి - పాడినది ఎస్. జానకి.

☆ ☆ ☆

# పతియే సింగారముగా

పతియే సింగారముగా
పతియే తన సొంత కొంగు
బంగారముగా
సతతము భావించుటయే
పతివ్రతల ధర్మ కర్మ
బంధము సుమతీ

నేనే పతివ్రతలకు న
మూనా సతి నొదునేని -
ముజ్జగముల నాదగు నేనిన్
నా నాథుని వణకు జబ్బు
నయమగు గాతన్!!

☆ ☆ ☆

# ఎదురీతకు లేదా అంతం

పల్లవి: ఎదురీతకు లేదా అంతం -
ఇక రాదా ప్రేమ వసంతం
రాకుంటే బ్రతుకే వ్యర్థం
విధిరాతకు ఇంతే అర్థం //ఎదురీతకు//

అనుపల్లవి: సాగరమే కడుచేరువనున్నా
దాహం తీరేనా?
తీరాలేవో కనబడుతున్నా
దూరం మారేనా!
ఎవరూ తీర్చని ఈ బాధలతో -
ఎన్నాళ్ళీ ఎదురీత!

1వ చరణం: చేయని నేరం గుండెల లోన
గాయం చేసేనా
మాసిన మదిలో మమత
ఎప్పుడూ ఆరని ఆవేదనతో
ఎన్నాళ్ళో ఈ ఎదురీత

2వ చరణం: చెరలో చిక్కిన జీవికి దక్కక
చెలిమి నశించేనా
మరలో ఇరికిన - ప్రాణికి విడుదల
మరల లభించేనా? //ఎదురీతకు//

---

ఇందిరా మూవీస్ వారి చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# తాగకు తాగకు అని

పల్లవి: తాగకు, తాగకు, తాగకు
అని నే ననలేను
ఆగకు, ఆగకు, ఆగకు,
అని మాత్రం నే నంటాను

అనుపల్లవి: లేత లేత పచ్చి పచ్చి
ప్రేమకేమి విలువ
చేతకాని పడుచు వాళ్ళు
చేయలేరు చొరవ

చరణం: వయసు కొంచం ముదరాలి
మనసు బాగా ఎదగాలి
మినుకు మినుకు మని
పెను చీకటిలో –
మెరిసే తార జీవితము
కాలవాహినీ తరంగాలలో
కదిలే నావ జీవితం //తాగకు//

☆ ☆ ☆

# చెయ్యలేని పని చేస్తాం

చెయ్యలేని పని చేస్తాం మనము
మొయ్యలేనిదే మోస్తాం మనము
అధికారం మా చేతికి వస్తే
చేసేదేదో చెబుతాము
చెప్పేదంతా చేస్తాము

మనదేశమనే రైలు బండిని
మంచి మార్గమున నడిపిస్తాం
సమానత్వమను స్టేషను చేరగ
చక చక పయనిస్తాం
కరువు రాక్షసిని హతమారుస్తాం
శాంతిదేవతకు పట్టం కడతాం
మనుషుల తత్వం మార్చేస్తాం
మరో ప్రపంచం సాధిస్తాం.

మన శాస్త్రీజీ – కృషిచేసిన
మరో ప్రపంచం – జై జవాన్ – జై కిసాన్
బ్రతుకు విలువ చాటుతాం –
ప్రగతి దారి సాగుతాం –
విజ్ఞానం పెంచుతాం
విశ్వశాంతి చాటుతాం
మన ఇందిరమ్మ సందేశం ॥మరో ప్రపంచం॥

☆ ☆ ☆

# వయసే వెల్లువగా

పల్లవి: వయసే వెల్లువగా - వలపే వెన్నెలగా
పులకరించి - పరిమళించి
ఊగెనులే ఉయ్యాలగా //వయసే//

అనుపల్లవి: వయసే వెల్లువగా - వలపే వెన్నెలగా
మనసు నేడు కలదీరి - ఊగిందిలే ఉయ్యాలగా
//వయసే//

1వ చరణం: చెలరేగెను సుడుగాలులూ
విడిపోయెను మన దారులూ
వలపు చిందింది జడివానలా
చిగురు వేయాలి మన ఆశలు
చెలిమినిండి కలలు పండి
చేరాలిలే చేరువగా //వయసే//

2వ చరణం: మది కళ్యాణ శుభవేదిక
ఇది వాసంత సుమవాటిక
హృదయ భావాలు - సిరిమల్లె లై
మధుర గీతాలు - పలికించె లే
గులాబీలే గుబాళించి
కురిపించేనులే దీవనలే //వయసే//

☆ ☆ ☆

# బతకాలా? చావాలా?

పల్లవి: బతకాలా? చావాలా?
అతీ గతీ లేని జనం
ఆకలితో – చీకటితో //బతకాలా//

అనుపల్లవి: కత్తుల కోరలు కనరాకుండా
నెత్తురు పీల్చే జలగల్లాగా
ధనగర్వంతో బలదర్పంతో
కన్నూ మిన్నూ కానని దుష్టులు //బతకాలా//

1వ చరణం: చెరిగిన జుత్తూ – చింపిరి గుడ్డలు
మురికి వాడలో పెరిగే బిడ్డలు
అరిగిన బతుకుల బరువులు మోస్తూ
దిక్కూ తెన్నూ తెలియని దీనులు,
నరకంలోపడి నకనకలాడే
నష్టజీవులు – నిష్టదరిద్రులు //బతకాలా//

2వ చరణం: పంటలుదోచే పందికొక్కులూ
మెతుకులు గతికే అక్కు పక్షులూ
అన్నెం పున్నెం తెలియని కన్నెల
చెరిచే, కరిచే, వేటకుక్కలు //బతకాలా//

3వ చరణం: ముప్ఫయియేళ్ళకే ముసలైపోయి
బతుకే రోతగ నిలిచే వాళ్ళు,
నలభై చాలవు – నాలుగు వందల
ఏళ్ళుండాలని – తలచే వాళ్ళు //బతకాలా//

---

ఈ పాట "ఇల్లే స్వర్గం" చిత్రంలోనిది. 17–1–78న ఎ.వి.ఎమ్.లో రికార్డింగ్ అయింది. పాడినవారు – ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం.

☆ ☆ ☆

# అలాగ చూడు - ఇలాగ చూడు

పల్లవి: ఓహో - హో - హో - హె - హోయి
అలాగ చూడు - ఇలాగ చూడు.
బలే మంచి శాంతమ్మ -
కులాసాల ఈ లోకంలో -
మన బ్రతుకే ఒక వింతమ్మ
అన్నిట్లో అందం చూడు -
అందర్లో హాయిని చూడు కల్లా
కపటం లేని వాళ్ళూ
ఉల్లాసంతో ఊగేరు //అలాగ చూడు//

అనుపల్లవి: చెట్టు మీద పిట్టల జంట
గుసుగుసలేవో ఆడేవంట
చురుకైన అమ్మాయ్ - అబ్బాయ్
నాలుగు కళ్ళే నవ్వేయి
వచ్చే పోయే కెరటాలు - అవి
తెచ్చే నెన్నో సరదాలు -
చిట్టి పొట్టి చిన్నోళ్ళు
ఏ చీకూచింతా లేనోళ్ళు
జాలిగుండె ఉండే వాళ్ళు -
లోకమంతా నిండాలి -
లక్షలుంటే లాభం ఏవిటి
లక్షణంగా ఉండాలి

చరణం: నిను చూస్తూంటే శాంతమ్మ నాకేదో
తెలియని అభిమానం - ఓహో - హో - హో
హోయి, ఇంకా
ఎందుకు అనుమానం - జత
కడితేనేలే ఆనందం //ఇలాగచూడు//

---

"సత్తెకాలపు సత్తెయ్య" చిత్రంలోనిదీ పాట. సంగీతం - ఎమ్. ఎస్. విశ్వనాధం; పాడినవారు - పిఠాపురం నాగేశ్వరరావు.

☆ ☆

# దయామయి శారదా

పల్లవి: దయామయి శారదా మము
తరింపగ సేయవే దేవీ ॥దయామయి॥

అనుపల్లవి: వియత్తరంగిణీ –
తీరవిహారిణీ! వీణా
పుస్తక పాణీ – వాణీ ॥దయామయి॥

చరణం: విరించిరాణీ – మంజుల భాషిణీ
వినీల మధుకరవేణీ
వినూత్న భావ –
సంగీత వినోదిని
విద్యాజ్ఞానదాయీ ॥దయామయి॥

---

ఇది రేడియోకి రాసిన గీతం.

☆ ☆ ☆

# మంచితనమే ఓడిపోయేనా

| | |
|---|---|
| పల్లవి: | మంచితనమే ఓడిపోయేనా<br>మానవత్వము మాసిపోయేనా<br>కరుణకోరి కాళ్ల వ్రాలినా<br>కఠిన హృదయమే – కరుగదాయెనే //మంచితనమే// |
| అనుపల్లవి: | ధనమే జగతికి ప్రధానమా.<br>మనసే మనిషికి ప్రమాదమా<br>ఈ విలువలు మారే దెప్పుడో<br>ఈ వేదన తీరేదెప్పుడో //మంచితనమే// |
| 1వ చరణం: | బాధ్యతలన్నీ తలపై మోసి<br>బ్రతుకే త్యాగం చేసిందొకడూ<br>పాశాలన్నీ పక్కకు తోసి,<br>పరాయి పంచను చేరిందొకడూ<br>ఈ భిన్నమార్గాల వ్యధ విన్నారా?<br>అన్నదమ్ముల కథ విన్నారా, ఈ<br>అన్నదమ్ముల కథ విన్నారా //మంచితనమే// |
| 2వ చరణం: | కాలకూటమును తానే మింగి<br>అమృతమొసగెను అన్నయ్య<br>పాలుపోసి పోషించిన చేతిని<br>కాటువేసెను తమ్మయ్య<br>ఈ భిన్నమార్గాల వ్యధ విన్నారా<br>అన్నదమ్ముల కథ విన్నారా ఈ<br>అన్నదమ్ముల కథ విన్నారా //మంచితనమే// |

---

"అన్నదమ్ముల కథ" చిత్రంలోనిదీ పాట. సంగీతం: పాడినవారు – జేసుదాసు. నా కిక్కడో విషయం రాయాలని వుంది. అన్నదమ్ములు –

అక్కచెల్లెళ్ళంటే శ్రీశ్రీ గారికి చాలా అభిమానం, ఆప్యాయతా వుండేవి. కాని పైకి తెలియపరిచేవారు కారు. మా అత్తగారైన అప్పన్నకొండకి - శ్రీశ్రీ గారు (మావారు) ఒక్కరే అయినా, మా రెండవ అత్తగారైన (శ్రీశ్రీగారి సవతి తల్లి) సుభద్రమ్మకి పిల్లలున్నారు. మావారూ వాళ్ళూ - సవతి బిడ్డల్లాగా వుండేవారు కారు వారి చెల్లెలు - అప్పన్నకొండ (మా ఆడబడుచు) అంటే మా వారికి మహా ఇష్టం. మా తమ్ముడు కొండబాబూ చెల్లి కొండమ్మా అని, వారి చిన్ననాటి ముచ్చట్లు అవకాశం దొరికినప్పుడల్లా - ఎంత చక్కగా చెప్పి, మురిసిపోయేవారో! మా తమ్ముడు కొండబాబు ప్రమాదవశాత్తూ చెర్లో పడి చనిపోయాడని చెప్పి, ఎంతో బాధపడేవారు. మా ఆడబడుచు కొండమ్మ కూడ - అన్నయ్యా అన్నయ్యా అని కలవరించేది. మావారు మీటింగులకోసం విశాఖకి కాని ఆ చుట్టు పక్కలకి కాని - వెళ్ళితే, తనవాళ్ళని చూడకుండా మిస్ అయిపోతానేమోనని తన రాక ముందుగానే వాళ్ళకి తెలియచేసేవారు.

# కాసు రాబట్టు

కాసు రాబట్టు మార్గమే కానరాదు
వెళ్లిపోయెడిదారులు వేనవేలు
ఆస్తి హరియించుకొని పోయె
                    అప్పు మిగిలె
ఎట్లు చెల్లింతు ఇంటద్దె
                    ఏడుపదులు!

# ఆశాజ్యోతికి ఆహ్వానం

పల్లవి: బయలుదేరింది పొగబండి
ప్రజలారా ఇక కదలండి
మలుపు లేనిదీ రహదారి
మళ్ళీ మ్రోగింది రణభేరి

అనుపల్లవి: దారిద్ర్యం పై తుది సమరం
ఐశ్వర్యం వైపిది పయనం
విశాలమైనది మన బండి
అంత మందికీ స్థల ముంది

1వ చరణం: దళపతులు బాధా వైణికులు
వీరే పోరే సైనికులు
కడలి తరగలై (వరదకై) వేస్తారు
కరువు బరువు ముంచేస్తారు

2వ చరణం: మహోదయం ఇది మరోయుగం
అహో మహోజ్జ్వల శుభాశయం
ఉన్నవి ఇరవై మజిలీలురా
ఉన్నవి అన్నీ విజయాలురా

3వ చరణం: కరిగింది కారు చీకటి
వెలిగింది తూర్పు వాకిలి
మరి లేదు వెనక చూపు
మనదే రాబోయే రేపు

4వ చరణం: క్రమశిక్ష శ్రీరామరక్ష
కార్యానుసాధనకు దీక్ష
కృషి చేసి చూపాలి మీరు
ఆ మీద పంచాలి సిరులు

5వ చరణం: చోటేదీ శోకాల తీరానికి
బోటేదీ పాటక జనాళికి
కష్టజీవులకే స్వరాజ్యం – కర్మవీరులకే స్వదేశం
మనదో మహాప్రజాస్వామ్యం
సకల జన స్వామ్యమే గమ్యం
అనుసరిస్తాం – ప్రగతి మార్గం
అనుభవిస్తాం – శ్రామిక భాగ్యం

☆ ☆ ☆

# నీకోసం వచ్చానే

పల్లవి: నీ కోసం వచ్చానే జవరాలా
నా కోరిక లీడే వేళ యివాళ

అనుపల్లవి: రారమ్మని వేరే పిలవాలా?
నేనే వచ్చానే ప్రియురాలా
ఏడో స్వర్గం ఎక్కించాలని
నీలో ఊహలు లెక్కించాలని
రానే వచ్చాను - నీ కోసం - నేనే వచ్చాను.

1వ చరణం: గడిచింది మరిచి పోదాం
ఇద్దరం కలిసి పోదాం
పెనవేసుకు పోతా - ని
న్నెగరేసుకు పోతా
నీకున్నట్టే నాకూ ఉందని
నీకూ నాకూ తెలుసునులే //నీ కోసం//

2వ చరణం: అంతులేదు ఆగిపోదు ఇంకావుంది
అంతకాదు ఇంతకాదు ఎంతో వుంది
మనలో మనకే కలహాలా?
మారు మాటాడకు ప్రియురాలా
పద పద పోదాం - షికారుగా
పండుగ చేద్దాం హుషారుగా
నీ సిగలో పూవులు ఘుమా, ఘుమా
నా యెదలో ఆశలు ధుమా - ధుమా

3వ చరణం: బిగువేలా యిక తగువేలా
ప్రియురాలా నీ అలుకేలా
మళ్ళీ నేస్తం కడదాం, రా
చల్లగ రాజీ పడదాం, రా
ఇరవయో శతాబ్దానికి – ఊర్వశీ
ఇరవయేళ్ళు దాటని నా ప్రేయసి
తగువేలా బిగువేలా – లలనా
నిను వీడి నేనుండ గలనా? ॥నీకోసం వచ్చానే॥

---

పల్లవీ పిక్చర్స్ వారి చిత్రంలోనిదీ పాట.

☆ ☆ ☆

# చీకటిలో కారు చీకటిలో

చీకటిలో కారు చీకటిలో
కాలమనే కడలిలో
శోకమనే పడవలో
ఏ దరికో – ఏ దెశకో ॥చీకటిలో॥

మనసున పెంచిన – మమతలు పోయె
మమతలు పంచిన మనిషే పోయె
మనిషే లేని మౌనము లోన
మనుగడ చీకటి – మాయమై పోయె
లేరెవరూ – ని కెవరూ ॥చికటిలో॥

జాలరి వలలో చేపవు నీవే
గానుగ మరలో – చెరుకువు నీవే
జాలే లేని లోకములోన
దారే లేని మనిషివి నీవె
లేరెవరూ – నీకెవరూ ॥చీకటిలో॥

☆ ☆ ☆

# తివిరి యిసుమున

పద్యం:

తివిరి యిసుమున తైలంబు
సవదరించు, ప్రకదరించు
నట్టులే మాటలో నుండియైన
బూతు దండిగా పిండగల
కవులు - జ్ఞానమూర్తులే వారు - శ్రీ శ్రీనివాస!

☆ ☆ ☆

# ఘల్లు ఘల్లుమని

పల్లవి: ఘల్లు ఘల్లుమని – అందెలు మ్రోగ
ఝల్లు ఝల్లుమని – డెందము రేగ
ఆనంద నాట్యం చేయనా
అనురాగ బంధం వేయనా

అనుపల్లవి: ఉయ్యాల లూగించు
నా లేత వయసు –
సయ్యాట లాడించు
నా మేని సొగసు –
పరవశమొందించి
మెరిసేటి వేళ //ఘల్లు ఘల్లుమని//

1వ చరణం: గులాబీల చెక్కిలిమీద
కురిసే ఎరుపు
విలాసాల కన్నుల నిండా
మెరిసే మెరుపు
తేనెల సోనలు – కురిసేటి వేళ //ఘల్లు ఘల్లుమని//

2వ చరణం: పసిడి వెన్నెల లేడినై
వేయి కన్నుల నెమలినై
ముల్లోకాల మైమరపించే
మోహన నాట్యం చేయనా? //ఘల్లు ఘల్లుమని//

---

పి. ఎస్. ఆర్. పిక్చర్స్ వారి "మాయా మశ్చీంద్ర" చిత్రంలోనిదీ పాట. 15–2–75 న ఈ పాట రాసేరు. 18–2–75 వ తేదీన విజయాగార్డెన్స్‌లో రికార్డింగ్ జరిగింది. పాడినవారు – పి. సుశీల బృందం.

# వలపులు విరిసిన

పల్లవి: వలపులు విరిసిన పూవులే
కురిపించె తేనియలే
మనసులు కలసిన చూపులే
పులకరించి పాడెలే

అనుపల్లవి: బరువు కనుల నను చూడకు
మరులు గొలిపి మది రేపకు
చెలి తలపే తెలిపేనులే
సిగలోని లేమల్లెలు //వలపులు//

1వ చరణం: ఉరిమిన జడిసే నెచ్చెలి
అడుగక యిచ్చెను కౌగిలి
నీ హృదయంలో ఒదిగినచో
బెదురింక ఏమున్నది? //వలపులు//

2వ చరణం: తొలకరి చినుకుల - చిటపటలు
చలిచలిగాలుల - గుసగుసలు
పెదవులపై మధురిమలే
చిలికించమన్నాయిలే //వలపులు//

---

"ఆత్మగౌరవం" చిత్రంలోనిదీ పాట. సంగీతం - రాజేశ్వరరావు; పాడినవారు - కీ. శే. ఘంటసాల, పి. సుశీల.

# కనలేరమ్మా గనరే

పల్లవి: కనలేరమ్మా గనరే – పని
వారిపై జాలి చూపరే
వినజాలరే – మా గాథల – అంతా
కూలీలం – మనమంతా కూలీలం ॥కనలేరమ్మా॥

అనుపల్లవి: ప్రపంచంలోని నిజంగా
త్యాగమే మనశీలం
ఆకలి బాధలతోనే – పెను
చీకటి బాటలలోనే –
ఎనరాని పాట్లతో – ఎనరాని
పాట్ల నగుబాట్లతో –
మన బ్రతుకే ఇలకే
బరువై పోయే
మనమంతా కూలీలం ॥కనలేరమ్మా॥

1వ చరణం: ఎండలో వానలో చలిలో
ఎంతగా పని చేసినా
ఆహారమే కనరాదాయె
ఆహా ఇదేమి అన్యాయమో ॥కనలేరమ్మా॥

2వ చరణం: పరితాపం భరించలేక
అవమానం సహించలేక
ఆధారమే కనరాక
ఆరాటమే మనరాతా?
నిరుపేద జీవులెటుపోయినా
కనరాదా దారి – లేదా జాలి
అంతా కూలీలం – మనమంతా కూలీలం ॥కనలేరమ్మా॥

సొసైటీ పిక్చర్స్ వారి "ప్రపంచం" చిత్రంలోనిదీ పాట. సంగీతం - 'జ్ఞానమణి.' పాడినవారు - టి. పూర్ణానందం. కాని ఈ "ప్రపంచం" చిత్రంలో ఎమ్. ఎల్. వసంతకుమారి, ఎన్. గానసరస్వతి, పి. లీల, ఎమ్. ఎస్. రాజేశ్వరి, వి. సరళ, పి. జి. కృష్ణవేణి (జిక్కి), డి. వసంత మరియు ఘంటసాల, ఎ. ఎమ్. రాజా, మాధవపెద్ది గార్లు పాడేరు. కాని ఎవరెవరే పాట పాడేరో - వారి పేర్లకు మారుగా - పిక్చర్లో పాడిన - పాత్రధారుల పేర్లు (అచ్చు పుస్తకాల్లో) వేశారు. అందువల్ల పాడినవారి పేర్లు సరిగ్గా ఇవ్వలేకపోతున్నందుకు విచారిస్తున్నాను.

☆ ☆ ☆

# ధనము నీయగవచ్చు

ధనము నీయగ వచ్చు
అసువు లీయగ వచ్చు
ప్రాణ సఖుని యిచ్చి బ్రతుకతరమే
    బ్రతుక తరమే –
త్యాగ శీలి వమ్మా మహిళా
అనురాగ శీల వమ్మా
తోటి వారికై సకలము నొసగె
కరుణామయివమ్మా! ॥త్యాగశీలి॥

నీ చిరునవ్వులు సోదరి జడలో
విరిసే మల్లియలు -
చల్లని నీ దీవెనలు – నవ దంపతుల
వలపుల వెన్నెలలు – ఓ .......
నిను విడిపోయినది – వలచిన హృదయము –
నీలో మిగిలె స్మృతులే మధురము ॥త్యాగశీలి॥

---

ఈ పాట "మంచి కుటుంబం" చిత్రంలోనిది.

☆ ☆ ☆

# ఓహో నిన్నే కోరగా

ఆమె: ఓహో - నిన్నే కోరగా - కుహూ - కుహూ - అనే కోయిలా
వసంత వేళలా - పసందు మీరగా -
అపూర్వగానమే - ఆలపించె తీయగా ॥ఓహో॥

అతడు: అదా కోరిక చిన్నారి కోయిల
జగాలే నీ చూపులో జలదరించెనే
వరాల నవ్వులే గులాబి పూవులై
వలపు తేనె నాలోనె చిలకరించెనే

అతడు: ఫలించె నేను కన్న కలలు తీయతీయగా

ఆమె: సుఖాలలో సోలిపో హాయిగా

అతడు: ఉయాల లూగే నామది - చిటారు కొమ్మలా

ఆమె: నివాళి అందుకో - ఈ వేళ పండుగా

ఇద్దరు: సదా సుధా తరంగాల తేలిపోదమా
ఓహో - ఓహో నిన్నే కోరితి
కుహూ - కుహూ అనీ పాడితి ॥ఓహో॥

# రాణీవు నెరజాణవు

అతడు: రాణివో నెరజాణవు
నా చెంత సిగ్గది మేలా నీ
వింత చూపుల వేలా
రాణివో – నెరజాణవు

ఆమె: చేరుకో చేరువ చేసుకో
ఈరేయి ఇద్దరి దోయి
నీదోయి నెచ్చెలి ప్రేమ
చేరుకో తేరుకో.

అతడు: తోటల కోటల లేనట్టిది
ఒకచోటను పాటను రానట్టిది
వేడికి ఆడుచు – నీడను పాడుచు
తేనెల స్నానము – లాడునది – //అదియేది//

ఆమె: కన్నియ కన్నుల దాగే దది
నవయువకుల – మనసులపై –
నిలిచేదది – ఆశగ –
ప్రియుడే వెదుకునది – అదియేది
ప్రియునికి స్వాగతమిచ్చేదది
తనప్రేయసి పెదవిని విరిసేదది
హాయిగ తీయగ ఆడెడు వేళల
రేయిని పగలుగ చేసేదది //అదియేది//

అతడు: విరిసిన ప్రాయపు వెలుగే అది
ఉప్పొంగిన హృదయం కోరేదది
కోరగసుధలై పాడునది చేరగ
మధువై చిందునది అది ఇది.

---

నందగారి ఫిలిమ్స్ వారి "కథానాయకుడి కథ" చిత్రంలోనిదీ పాట. సంగీతం – కే.శే. కోదండపాణి; పాడినవారు – పి.సుశీల, పి.బి. శ్రీనివాస్.

# ఆరని అగ్నిజ్వాల

పల్లవి: ఇది ఆరని అగ్నిజ్వాల -
ఇది ఆగని విప్లవహేల -
కడలి కెరటమై - పిడుగుల జడినై
ఇదిగో ఇదిగో - వస్తున్నా
బ్రతుకున వెలుగు తెస్తున్నా

అనుపల్లవి: కష్టజీవులకు కన్నీళ్లెందుకు?
సోమరులెంతో సుఖపడు టెందుకు?
ఎందుకు - ఎందుకు - ఎందుకు?

1వ చరణం: నిరంకుశత్వపు - నీలుగులెందుకు?
నిర్దోషుల తల - వాలడ మెందుకు?
ఎందుకు, ఎందుకు, ఎందుకు?

2వ చరణం: ఎందు కెందుకని నిలదీస్తేనే
ముందు ముందు మనకుంది - విముక్తి
అదే అదే మన శక్తి

3వ చరణం: కుళ్లిన వ్యవస్థ మారే దెప్పుడు?
దీనుల అవస్థ తీరేదెప్పుడు?
ఎప్పుడు, ఎప్పుడు, ఎప్పుడు?

4వ చరణం: అవినీతికి తుది సమాధి ఎప్పుడు?
నవసౌధపు తొలి పునాది యెప్పుడు?
ఎప్పుడు, ఎప్పుడు, ఎప్పుడు?

5వ చరణం: ఎప్పుడెప్పుడని దిక్కులు చూడక
ఇప్పుడే నడుం బిగించి లెండి
ముందు ముందుకు కదలండి.

---

జి. వి. కె. ప్రొడక్షన్స్ వారి "అగ్నిజ్వాల" చిత్రంలోనిదీ పాట. సంగీతం - కీ. శే. సత్యం; పాడినవారు - ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం. 15-2-88వ తేదీన జెమినీ స్టూడియోలో రికార్డింగ్ జరిగింది.

# మధురం మధురం

| | |
|---|---|
| పల్లవి: | మధురం - మధురం - మనోహరం<br>రాధా మాధవ - ప్రణయ విహారం |
| అనుపల్లవి: | ఆ మనోజ్ఞ - యమునాతీరములో<br>కోమల మలయ సమీరములో<br>ప్రశాంత - నిశాంత - సమయములో<br>పరిమళ లతా నికుంజములో //మధురం// |
| చరణం: | నిరంతర సరస సరాగముతో<br>నిగూఢ విచిత్ర వచనముతో<br>వినోద విహార - లీలలతో<br>విరచిత భావ - జలక్రీడలతో //మధురం// |

---

ఈ పాట రేడియో కోసం రాసిందని అనుకుంటున్నాను.

☆ ☆ ☆

# సందేహంలేని శ్రీ శ్రీ సందేశం

కడప జిల్లా రచయితలారా
సుచరితులారా
మీతో గడపిన క్షణాలు - మరచిపోలేని
మధుర స్మృతి కణాలు -
అట్టే నేను సందేశాలివ్వను - ఇచ్చానా
అది సందేహం లేని సందేశమే.

రచనకు బ్రతుకే పునాది
బ్రతుకు తానే సమాధి -
బ్రతుకు నెగసన తొయ్యాలి -
మరణం పరువు తియ్యాలి.

చచ్చు పుచ్చు భావాలే - మన విరోధులు -
వాటికే కట్టాలి సమాధులు -
ముఖ సంస్తుతు లావల త్రోయండి - ని
ర్మొగ మాటంగా రాయండి
మంచి మనిషి కనిపించాడంటే -
పంచరత్నాలు రాయొద్దనను -

మంచిని ఎగసన త్రోయండి
వంచనను తృంచి వేయండి బ్రతకండి -
బ్రతుకును చదవండి - చదువుతూ రాస్తూ -
కొత్త కొత్త రహదారులు వేస్తూ - బ్రతకండి

బ్రతుకు కోసమే రాయండి
చావును చంపి వేయండి!

---

[ఇది సినిమాకు రాసింది కాదు. కడప జిల్లా సాంస్కృతిక సంఘం ప్రచురించిన "వసంతోత్సవ సుమాంజలి" అన్న ప్రత్యేక సంచికకు పంపించిన శ్రీ శ్రీ - "సందేహం లేని సందేశం" - జూలై - 1976]

★ ★ ★